# విషయ సూచిక.



జయముగాంచిన విజయసారథి. భారత స్వాతంత్ర్యసమరమున నవ్యాప్రసాహసమునఁ బోరాడినసేనాని. సద్యస్స్ఫురణ, సూక్ష్మ దృష్టి, శీఘ్రనిర్ణయము, భావగాంభీర్యము, వజ్రసంకల్పము, నిర్మాణ నైపుణ్యము, కార్యదీక్ష. ఆత్మవిశ్వాసము, సమాజ వివేకము, సద్గాదు ప్రత్యేక గుణములు.

ఆయన నిష్కపటి; కాంగ్రెసు నాయకులందఱిలోను మంచి నిష్కర్షకలవాఁడని ప్రఖ్యాతిగాంచినవాఁడు. పైకి తను కటువులుగ కానివారంటియును ప్రతికూలురని తోచినను భావించును. తటస్థభావ మనునది లేనే లేదు. ఆయన తలపెట్టిన పని గెల్పునను సాధించక విడచిపెట్టఁడు. నిందాస్తుతులను లక్ష్యపెట్టఁడు. కర్తవ్యనిర్వహణలోఁ జండశాసనుఁడు. బారిష్టరయియుండికూడ దాను గర్వకుఁడనని చెప్పికొను వినమ్రమూర్తి.

ఇంపీరియలిజము, ఫాసిజములవలె సోషలిజము, కమ్యూనిజములుకూడ నాయనకు సరిపడని సంగతులు. గాంధీయిజమే యాయనకు గణనీయమైనది.

* "తన హస్తములపై నాడిజరిగిన నెంతో పట్టుదలతో వ్యవహరించునో చెప్పుటకు వీలు లేదు.

"స్వార్థరహితుఁడు. పనికిమాలినవారిని, సంతకంగా నెక్కడనైనా దుష్టులను, నియంతలను నిరసించువాఁడు.

"పోరాటము - ఇదియే యాయన నినాదము.

"సత్యాగ్రహిగాఁ బోరాడును. ఎవరిపై సహాయనిరాకరణము సాగించునో, యతనితో సహకారమునకై యెప్పుడును సిద్ధముగనే యుండును, యథార్థమైన సత్యాగ్రహి.

---

* 1945 నవంబరులో వెలువడిన 'ఆంధ్రప్రభ'లో, పట్టాభిగారి వ్యాసమునుండి.

"పటేలువారిని కాంచిన త్వరగా ఆకర్షింపఁడు, అనవసరమేమో, యనునపుడు మౌనము వహింపఁగల విచక్షణ యాయనకుఁ గలదు. అనవసరమని భావించినచో నొక్క ముక్కయైన విడువఁడు. ఎప్పుడు నొక సూత్రముపైఁ బోరాడును. పోరాట నారంభించినచో సర్వశక్తులను వినియోగించును. కొట్లాటలో నైనను, వివాదములలో నైనను, ఉద్యమములో నైనను సిద్ధాం ముఖ్యమైన తత్త్వము. జయమందుటయే ముఖ్యమైన లక్ష్యము. చర్చలలోఁ గానిండు, ఎన్నికలలోఁ గానిండు, విజయమునకై యాయన మహాతురత నొందును. అప్పటియైన నాయన యోర్మి పూర్తిగా నశించును. ఒక్కొక్కప్పుడు ప్రతిపక్షము నేమాత్రము సహింపలేఁడు. ప్రతికక్షులను గట్టిగా, ననుచితమైనవిధముగా మాటలాడి నొప్పించు తత్త్వము. కాని తన చమత్కృతితోఁ జెలికాండ్రలలోఁ బ్రతిపక్షులయందు విద్వేషభావము కలుగకుండఁ జేసికొనఁగల దిట్ట."

భూలాభాదేవలె సర్దారు పాండిత్యప్రకర్ష కలవాఁడు కాఁడు. కాని యపారమైన ప్రపంచజ్ఞానముకలవాఁడగుటచేఁ బాండిత్య లోపము బయటపడదు.

జవహరులాలువలె విస్తృతముగ విదేశములలోఁ బర్యటనచేసినవాఁడు కాఁడు, కాని చక్కని యూహాశక్తి కలవాఁడు.

సుభాషబాబువలె ననిర్దిష్ట సాహసోపేతకార్యములకుఁ గడంగఁడు. తన కార్యాచరణప్రణాళికను ముందుగనే సిద్ధము చేసికొని దానిని నిరంతరాయముగ ననుసరించును.

రచన తక్కువ – కాని కాగితముపైఁ గలముపెట్టిన

ధారాళముగ నడచును–ఆయన శైలి సంక్షిప్తము, అత్యంత సునిశితము–

ఉపన్యాసములు దంచి వేయువాడగు కాడు–కాని తన యుపన్యాసవిషయములోని ప్రతి మాటయందును తన నమ్మిక యావేశమును గోచరింపజేసి పాటుపడును. చక్కని చాతుర్యములతో, బిట్టకథలతో దన యుపన్యాసమును విన సొంపుగా దీర్చిదిద్దును.

ఆయన వాక్యములు చిన్నవి – బల్లెపుపోటులవలె నుండును. స్వరాజ్యము స్థాపించినపిమ్మట నెంతోకాలముపాటు గాంధిజీ శిష్యులలో నగ్రస్థానము వహించిన వాడుగా సర్దారు స్మరింపబడును. అచంచలస్మృతి గలిగిన స్థితప్రజ్ఞుడుగా, నఖండ సేవాసక్తి గల కర్మయోగిగా చాలకాలము స్మరణీయుడై యుండగలడు.

కార్యాచరణమున విశ్వాసము, ఫలసిద్ధిపట్ల సమగ్రమైన యాశ, ధర్మబుద్ధి – ఏసుక్రీస్తు తన శిష్యులకీ గుణత్రయమును బోధించినాడు. ఈ గుణత్రయమున కనుగుణముగనే తన దేశమునకు, మానవజాతికి స్వార్థరహితసేవ చేసినవాడుగ స్వరాజ్యసిద్ధ్యనంతరము సర్దారు బహుకాలము స్మరింపబడ గలడు.

ఆయన జన్మతః నాయకుడు. విద్యార్థిదశలోనే నిర్భయుడని పేరు పొందినవాడు. విద్యార్థులను సంఘటితపఱచి నాయకత్వము వహించి స్వార్థపరులైన యుపాధ్యాయుల నుద్యోగ మూడగించినవాడు.

న్యాయవాదవృత్తిలో క్రిమినల్ లాయరుగా ప్రఖ్యాతి

స్వాయత్తమొనర్చిన నేర్పరి - అశోకుడు, అక్బరు సాధించలేని ఏకచ్ఛత్రాధిపత్యము సాధించిన సామర్థ్యము సర్దారుకే కలిగినది. సర్దారు తన జీవితములో సాధించిన ఘనతర విజయ మిది.

అంతర్జాతీయ విషయముల నెహ్రూ అఖండ ఖ్యాతిం గాంచినట్టులనే స్వదేశవ్యవహారవిషయములలోఁ బటేలు ప్రతిభా వంతుఁడని ప్రఖ్యాతిం గాంచినాఁడు.

వారు భారత భాగ్య విధాతలు.

ఆయన నాయకత్వమున భారతభూమి యవరోధముల నన్నిటి నతిక్రమించి యనతికాలములో నభ్యుదయము నొందఁ గలదని నిస్సందేహముగా భావింపవచ్చును.

## పితృ పరిచయము

వల్లభాయిపటేలు తండ్రిపేరు జవేరుభాయి వృత్తిచేఁ గర్షకుఁడు. ఆయన జన్మస్థానము గుజరాతులోని పేట్‌లాద్ తాలూకాలోని కరంసాద్ గ్రామము-జవేరుభాయి సామాన్య గృహస్థుఁడే కాని ధైర్య సాహసములలో సాటిలేని మేటి. 1857లో జరిగిన స్వాతంత్ర్యసమర మాయన కర్షకహృదయము నాకర్షించినది. గొడ్డు, గోద, పిల్ల, మేక, భూమి, పుత్రు వదలిపెట్టి యా స్వాతంత్ర్యసమరమునఁ జేరినాఁడు. వీర నారి ఝాన్సీలక్ష్మీ బాయి దళమునఁ జేరి స్వాతంత్ర్య సమరము సాగించినాఁడు.

ఆయన తెలివితేటలు, నిర్భయత, యాయన కెన్ని యాపదలు వచ్చినను నభివృద్ధిఁ గాంచినవి. అందుల కొక

యుద్ధాంహారణము. ఆ స్వాతంత్ర్యసమరమున 'ఝాన్సీరాణి'వైపు నొక స్వదేశసంస్థానాధీశునిచే నాయన ఖైదునం దుంచబడెను. ఒకనాఁ డా కారాగృహప్రాంగణమునందే మల్హారావు రాజు చదరంగ మాడుచుండెను. ఆయన యెత్తులలోఁ దప్పులు చూపి మంచి యెత్తులు చెప్ప నారంభించెను ఝవేర్భాయి. అందువలన మహారాజు ఝవేర్భాయి సాయమువలననే ఆటలో గెలుపు పొందెను. అంతట మహారాజు ఝవేర్భాయిపై ననుగ్రహము కలవాఁడై యిట్టి వివేకవంతుని బందిగా నుంచుట తగదని విడుదల చేయించెను.

ఝవేర్భాయిలో ధైర్యసాహసములతో పాటు భగవద్భక్తి కూడ నుండెను. ఆహార విహారాదులలో నాయన యతి బాగ దూరకత కలిగి యుండినాఁడు. నియమనిగ్రహములు కలుగుటచే మంచి యారోగ్యవంతుఁడై తొంబది యేండ్లు జీవింపఁ గలిగెను.

ఆపదలలో సడలని మనోధైర్యము గాని దూకునట్టి సాహసము, ప్రతిభ, కష్టసహిష్ణుత మొదలగు గుణగణము లన్నియు వల్లభాయికిఁ బితృపాదులనుండి సంక్రమించినవి.

ఝవేర్భాయికి గల సంతానము - అయిదుగురు కుమారులు; ఒక కుమార్తె. ప్రథముఁడు సోమాభాయి, ద్వితీయుఁడు నరసీభాయి. తృతీయ చతుర్థులు విఠలభాయి, వల్లభాయులు- ఐదవవాఁడు కాశీభాయి-కుమార్తె పేరు దహీబేను, చిన్నతనములోనే చనిపోయినది. నాలుగవవాఁడగు వల్లభాయి 1875 సం॥ అక్టోబరు 31 తేదీన జన్మించెను.

# విద్యార్థిదశ

వల్లభాయి బాల్యములోఁ దండ్రివెంటఁ బొలము వెళ్లుచుండెడివాఁడు. తండ్రి కొలఁదిగాఁ జదివికొన్నవాఁ డగుటచేత నింటియొద్దఁ బాఠము లన్నిటి నక్కడఁ గంఠస్థము చేయించుచుండెను. ఇట్లు కొంతకాలమైనతరువాత నాతఁడు వల్లభాయిని నడియాడ్‌లోని యాంగ్లపాఠశాలకుఁ బంపెను.

బాల్యమునుండి పటేలు మంచిచుఱుకు, కఱుకు గల వాఁడు. చదువుసంధ్యలలో నందఱికంటె నధికుఁడే కాని మిక్కిలి పెంకె.

ఒకసారి లెక్కలమాస్టరింటివద్దఁ బది లెక్కలు చేసి కొని రమ్మనఁగాఁ జేసికొనిరాలేదు. ఆయనకు లెక్కలు బాగుగానేవచ్చును. క్లాసులో లెక్కలు బాగుగనే చేయుచుండెను. అందుచేతనే యాయన యా లెక్కలు చేసికొని రాలేదు. అయినను దాను జెప్పినట్లు చేయనందులకుఁ బంతులు కోపించి మఱునాఁడు మఱల నా పదిలెక్కలను జేసికొనిరమ్మని చెప్పెను. ఆనాడు పటేలు లోకగణితపుస్తకమును దీసికొని 'యిదిగో! పంతులుగారు! ఇందుఁ జాల లెక్కలున్న'వని చూపించెను.

ఆయన నడియాడ్‌లోఁ జదువుచున్న రోజులలో మఱియొక ఘట్టము జరిగినది. నేటికిఁగూడఁ గొన్ని స్కూళ్లలో జరుగుచున్నట్లే యాస్కూలులోఁగూడ నుపాధ్యాయుఁడు పుస్తకము లమ్ముచుండెను. ఇందువలన నాయనకుఁ గొంచెమో గొప్పయో లాభము ముట్టుచుండెను. తన వద్దనే పుస్తకము

లను గొనఁడని యాయన పిల్లలను ఒబాయించుచుండెను. మన పటేలు చిన్నతనములోనే యీ పంతులవద్ద నెవ్వరును బుస్తకములను గొనఁగూడదని క్రొత్త పిహారీ లేవఁదీసెను. ఆ నాయకుని యాజ్ఞానుసారముగాఁ బిల్లలందఱును బుస్తకములు కొనకుండుటయేగాక, సమ్మెకూడఁ జేసిరి. ఇట్లయి యాఱురోజులు సమ్మె జరుగువఱకు పంతులు లొంగివచ్చి మీ యిష్టము వచ్చినచోటఁ బుస్తకములు కొనవచ్చునని యంగీకరించెను. తమకోరిక నెఱవేఱఁగాఁ బటేలు పరామర్శతోఁ బిల్లలందఱును బడికి వెళ్లిరి.

నడియాడ్‌లో విద్యాభ్యాసమైన తరువాత వల్లభాయి 'బడోదా' పాఠశాలలోఁ బ్రవేశించెను. సంస్కృతము చదువుట యాయనకిష్టములేదు. అది చాలకష్టమైన భాషగా నాయనకుఁ దోఁచినది. అందుచేత మెట్రిక్ పరీక్షలో నాయన గుజరాతినే తీసికొనెను. 'ఛోటేలాల్' అను ఉపాధ్యాయుఁ డాయనకు గుజరాతి చెప్పుచుండెను. కాని యాయనకు సంస్కృత మనిన నమిత్రప్రేమ. సంస్కృతము చదువనివారిని హేళన చేయుచుండెడివాఁడు. వల్లభాయి యాయన క్లాసులోఁ బ్రవేశింపఁగనే వ్యంగ్యముగా 'దయచేయుఁడు, మహాపురుషు'లని యాయన హేళనచేసెను. వ్యంగ్యముగా నుడివిన యా వాక్యమే యథార్థమగునని యా పంతు లేమి యెఱుఁగును?

పటేలు కప్పుడు పదుమూఁడు, పదునాలుగేండ్లు— అతఁడు క్లాసులోఁ బ్రవేశింపఁగనే యుపాధ్యాయునకు నతనికి నీ సంభాషణము జరిగెను.

"ఎక్కడనుండి వేంచేసితిరి?"

'కరంసాద్‌నుండి' యని వల్లభాయి వినయపూర్వకముగా సమాధానము చెప్పెను.

"సంస్కృతము తీసికొనక గుజరాతీ తీసికొంటివే! సంస్కృతము లేక గుజరాతీ గణనీయముకాదని నీకుఁ దెలియదా" యని యా పంతులనెను.

అంతట నా పెంకెవాఁడిట్లుత్తర మిచ్చెను. "అందఱును సంస్కృతమే తీసికొన్నచోఁ దమరు చెప్పుట వెవ్వరికి?.

ఈ యథార్థమును జెప్పినందుకుఁ బటేలు పంతులుగారి కోపమునకు గుఱియయ్యెను. ఆ రోజెల్ల బెంచిమీద నిలువఁబడ వలసినదిగా శిక్షింపఁ బడెను.

మాస్టరుగారి కీ శిష్యుని కీ శిక్షవిధించుటతోఁ దృప్తి కలుగలేదు. ఆయన క్రోధాగ్ని దినదినము ప్రజ్వరిల్లి వల్లభాయిని బాధింపసాగెను.

ఆయన వల్లభాయిని బ్రతిరోజు నింటివద్ద నధికముగా వ్రాసికొని రమ్మని విధించుచుండెను. గుజరాతీలో దీనిని 'పహాడే' యందురు. 'పాడే' యను నామాంతరమును గలదు. పాడే యనఁగ దూడ యనికూడ నర్థాంతర మున్నది. ఒకనాఁ డా మాస్టరు పటేలును 'నీవు పాడే చేసికొని వచ్చితివా' యని యడిగెను.

పెంకెతనమునలోఁ బ్రసిద్ధుఁడైన పటేలు 'మాస్టరుగారూ! పాడేను దీసికొని వచ్చితిని. స్కూలు ఆవరణలోనికి రెండు మూడడుగులువేసి సరాలునఁ బాఱిపోయిన'దని సమాధానము చెప్పెను.

ఇటువంటి పిల్లవాని నెక్కడను జూడలేదని యతఁడ

చను గోరుచున యాయన పిల్లలకు నిరంతరము సహా యున పటేలు చిన్నతనములోనే యీ పంతులనెదిర్చి నిప్పయను పుస్తకములను గొనగూడదని నాతని పట్టుదల తీవఁదీసెను. తనాయకుని యాజ్ఞానుసారముగాఁ బిల్లలందఱును పుస్తకములు కొనకుండుటచే నాఁడు పాఠశాల మూసిరి. ఇట్లాయి దారురోజులు సమ్మె జరుగువఱకు పంతులు లొంగివచ్చి మీ యిష్టము వచ్చినచోటఁ బుస్తకములు కొనవచ్చునని యంగీకరించెను. తమకోరిక నెఱవేఱఁగాఁ బాలురు పరా మర్శగాఁ బిల్లలందఱును పాఠశాల కేగిరి.

నడియాద్‌లో విద్యాభ్యాసమైన తరువాత వల్లభాయి 'బరోడా' పాఠశాలలోఁ బ్రవేశించెను. సంస్కృతము నందు నట్టి యాయనకిష్టములేదు. అది చాలకష్టమైనట్టి భాషగా నాయన కఁగా దోఁచినది. అందుచేత మెట్రిక్ పరీక్షలో నాయన గుజరాతినే తీసికొనెను. 'ఛోటేలాల్' అను ఉపాధ్యాయుఁడాయనకు గుజరాతి చెప్పుచుండెను. కాని యాయనకు సంస్కృతమనిన నమితప్రేమ. సంస్కృతము చదువనివారిని హేళన చేయు చుండెడివాఁడు. వల్లభాయి యాయన క్లాసులోఁ బ్రవేశింపఁ గనే వ్యంగ్యముగా 'దయచేయుఁడు, మహాపురుషు'లని యాయన హేళనచేసెను. వ్యంగ్యముగా నుడివిన యీ వాక్యమే యథార్థమగునని యా పంతులేమి యెఱుఁగును?

పటేలు కప్పుడు పదుమూఁడు, పదునాలుగేండ్లు—అతఁడు క్లాసులోఁ బ్రవేశింపఁగనే యుపాధ్యాయునకు నతనికి నీ సంభాషణము జరిగెను.

"ఎక్కడనుండి వేంచేసితిరి?"

'కరంసాద్‌నుండి' యని వల్లభాయి వినయపూర్వకముగా సమాధానము చెప్పెను.

"సంస్కృతము తీసికొనక గుజరాతీ తీసికొంటివే! సంస్కృతము లేక గుజరాతీ గౌరవనీయము కాదని నీకుఁ దెలియదా" యని యా పంతులనెను.

అంతట నా పిల్లవాఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "అందఱును సంస్కృతము తీసికొన్నచోఁ దమరు చెప్పుట యెవ్వరికి ?."

ఈ యథార్థమును చెప్పినందుకుఁ బటేలు పంతులుగారి కోపమునకు గుఱియయ్యెను. ఆ నాఁడెల్ల బెంచిమీఁద నిలువఁబడ వలసినదిగా శిక్షింపఁబడెను.

మాస్టరుగారికి శిష్యుని శిక్షవిధించుటలోఁ దృప్తి కలుగలేదు. ఆయన క్రోధాగ్ని దినదినము ప్రజ్వరిల్లి వల్లభాయిని బాధింపసాగెను.

ఆయన వల్లభాయిని ప్రతిరోజు నింటివద్ద నధికముగా వ్రాసికొని రమ్మని విధించుచుండెను. గుజరాతీలో దీనిని 'పాఁడే' యందురు. 'పాడే' యను నామాంతరమును గలదు. పాడే యనఁగ దూడ యనియొక యర్థాంతర మున్నది. ఒకనాఁ డా మాస్టరు పటేలును 'నీవు పాడే చేసికొని వచ్చితివా' యని యడిగెను.

పెంకితనములోఁ బ్రసిద్ధుఁడైన పటేలు 'మాస్టరుగారూ! పాడేను దీసికొని వచ్చితిని. కుఱ్ఱలు ఆవరణములోనికి రెండు మూఁడడుగులు వేసి సరాలునఁ బాఱిపోయిన"దని సమాధానము చెప్పెను.

ఇటువంటి పిల్లవాని నెక్కడను జూడలేదని యతని

మీరాసు ప్రశ్నించి పటేలును శిక్షింపవలసినదని హెడ్మాస్టరు వద్ద కాయన పంపించెను. ఆ ప్రధానోపాధ్యాయుఁడు యథార్థము చెప్పవలసినదని పటేలు నడిగెను. అంతటఁ బాలుఁడు చేటభారతము నిట్లు విప్పెను— 'ఏమిచేయుమంటే? ప్రతిసారియును నన్ను వ్రాసికొని రమ్మని వేధించుచున్నాఁడు. ఇది నేమి శిక్షయా? నేను జదివికొను పుస్తకమునుండి నేదైన వ్రాసికొని రమ్మనినఁ గొంత ప్రయోజన ముండును. వ్రాసినదే వ్రాసినచో నేమి ప్రయోజన ముండఁగలదు?" ప్రధానోపాధ్యాయుఁడు వల్లభాయి చెప్పిన మాటలను విని యతని నేమియు శిక్షింపక యూరక యే వదలిపెట్టెను. ఆ హెడ్మాస్టరు 'ఇట్టి పిల్లవాని నే నెన్నఁడుఁ జూడలే దని జీవితాంతమువఱకు ననుచుండెడివాఁడు.

ఇట్లు పటేలు నిర్భయత, సాహసము, వినోదమును తెలియఁజేయు ఘట్టము లెన్నో విద్యార్థిదశయందుఁ గలవు.

నడియాడ్‌లో మఱొక యుపాధ్యాయునితో వివాద మేర్పడెను. తత్ఫలితముగా నాయన బరోడా హైస్కూలు నుండి పంపివేయఁబడెను. తరువాత మరల నడియాడ్‌లో హైస్కూలులోఁ బ్రవేశించి మెట్రిక్ పరీక్షలో నుత్తీర్ణుఁ డైనాఁడు.

## ప్లీడరుగా.

వల్లభాయితండ్రి యాస్తిపరుఁడుకాఁడు. అందుచేత వల్లభాయి కింకను నున్నతవిద్య నభ్యసించుట కవకాశము లేకపోయెను. ఆతనికిఁగూడఁ గళాశాలావిద్య నభ్యసించు నభిరుచి లేకపోయెను. అయినను నాంతర్యములో బారిష్టరు పరీక్షకుఁ జదువవలయునని యుండెను. కాని చేతిలో ధనము లేదు. ధన సంపాదనకొఱకై ప్లీడరీపరీక్ష చదివి గోధ్రాలోఁ బ్రాక్టీసు ప్రారంభించెను. తరువాత బోర్సద్ వెళ్లి యక్కడఁ బ్రాక్టీసు పెట్టెను. ఆయన యక్కడ నడుగు పెట్టఁగనే మహాప్రఖ్యాతి నార్జించెను. కేసులు చాల వచ్చుచుండెను. క్రిమినలు కేసులనిన నాయనకు మిక్కిలి సరదా—మానవ స్వభావము తెలిసినవాఁడు, సహజప్రతిభావంతుఁడు గనుక నాయన యీ ప్లీడరీ వృత్తిలోఁ బేరుప్రఖ్యాతుల సంపాదించెను.

పటేలు లధికముగా, ఖూనీ, దోపిడి మున్నగు క్రిమినలు కేసులు పట్టుచుండెను. క్రిమినలు లాయరుగా నాయన పేరుప్రఖ్యాతులు మిన్నంటుచుండెను. ఆయన పేరు విన్న పోలీసు అధికారులు, మేజిస్ట్రేటులుకూడ భయపడుచుండిరి. వల్లభాయి పటేలును వదలించుకొందమని మేజిస్ట్రేటు తన కోర్టును బోర్సద్ నుండి యానందపట్నమునకు మార్చుకొనెను. కాని యక్కడకును బటేలు తయారయ్యెను. ప్రాక్టీసు వెనుకటి మాదిరిగనే యిక్కడకూడఁ బెరుగసాగెను. ఆ మేజిస్ట్రేటు మరలఁ బటేలుతోఁ బడలేక కోర్టును బోర్సదుకు మార్చెను. మరల నిక్కడకూడ నాయనదే ప్రత్యక్షము.

## భార్యావియోగము - స్థితప్రజ్ఞత్వము

పటేలు గోధ్రాలో నున్నప్పుడా పట్టణమునఁ బ్లేగు వ్యాధి యతిభయంకరముగాఁ బ్రబలినది. ఆ కోర్టు నాజరు కుమారునకుఁగూడ నా వ్యాధి సోకెను. ఆ కుర్రవానికి వల్లభాయి చాల సపర్యలు చేసెను. కాని యతని మరణము తప్పలేదు. వల్లభాయికిఁగూడ జబ్బుచేసినది. ఆ జబ్బుస్థితిలోనే యాయన బండిమీద నానందిపట్టణమునకు వచ్చెను. వచ్చి భార్యతో కరంసాద్ గ్రామమునకుఁ బొమ్మనిచెప్పి తాను నడియాద్ కుఁబోయెను. ఆయనభార్యకు జబ్బుగానున్న భర్తకు సేవ చేయువలయునని యుండెను. కాని పటేలుమాటకుమారాడ లేక యామె యూరకుండెను. ఇంతకు విధి వేఱువిధముగా నున్నది. వల్లభాయి నడియాద్ చేరఁగనే యారోగ్యము నొందెను. కులాసాగానున్న యాయన భార్య కరంసాద్ చేరఁగనే మంచము పట్టెను. వల్లభాయి యామెను బొంబాయి పంపి యాపరేషను జేయించెను. ఆస్పత్రినుండి భార్య యారోగ్యమును గూర్చి యాయన కనుదినము వార్తలు వచ్చుచునే యుండెను. ఆమె యారోగ్యము నానాటికిఁ జెడి తుదకుఁ బ్రాణాపాయమే కలిగెను. ఆయన కోర్టులో వాదించుచుండఁగా (1908) భార్య చనిపోయినదని టెలిగ్రాము వచ్చినది. పటేలు వాదమధ్యమున నుండెను. టెలిగ్రాము చదువుకొని యించుక మాత్రమైనఁ జలించక తన వాదమును బూర్తిచేసెను. తరువాత మిత్రులు టెలిగ్రాముసంగతి నడుగగా వారికీ సమాచారముఁ దెలియఁ జేసెను.

ఒకసారి పటేలుకు జబ్బుచేసినది. డాక్టరు క్లోరోఫారం ఇచ్చి యాపరేషను చేయవలయునన్నాఁడు. "నే నెంత బాధకైన నోర్చుకొనఁగలను. క్లోరోఫారం మక్కఱలేదు. నా కాపరేషను చేయు"డని పటే లన్నాఁడు.

ఆ ప్రకారమే చేసి యిట్టి ధీరుని నా జన్మములోఁ జూడలేదన్నాఁడు డాక్టరు.

ధీరప్రవృత్తి యీయనకుఁ బ్రథమమునుండి పెట్టిన వెన్నదో.

## బారిష్టర్

పటేలు కన్నిఁట నుత్తమశ్రేణియం దుండవలయుననియే కోరిక. తనకంటె నన్నివిధములఁ దక్కువైనవారందఱు నున్నత స్థానముల యందుండుట నాయన సహించలేకపోయెను. ప్లీడరీ వల్ల ధనము నార్జించెను. దానితో బారిష్టరీ చదివి రావలయు నని సంకల్పించి యందులకుఁ దగిన యేర్పాటు లన్నిటిని సిద్ధము చేసెను. ప్యాసుపోర్టుకూడ వచ్చినది. అయితే పెద్దపటేలు పేచీలు పెట్టుటలోఁ బ్రముఖుఁడన్న సంగతి ప్రపంచ విఖ్యాతము. అట్లే యీయన తమ్మునితోఁగూడఁ బేచీకోనికి దిగినాఁడు. "నేను నీకంటెఁ బెద్దవాఁడను. నేను బారిష్టరీ చదివిన తరువాత నీవు చదువవలయు"నని తమ్ముని యొప్పించినాఁడు. ఇంగ్లీషులో నిద్దఱిపేళ్లును వి. జె. పటేలే గనుక నా ప్యాసుపోర్టు పనికి వచ్చినది. అనుకొన్నట్లన్నగారు వచ్చినతరువాతఁ దమ్ముఁ డింగ్లాండునకుఁ దరలినాఁడు.

ఇంగ్లాండులో వల్లభాయి యనేకపరిశ్రమ చేయుచు విద్యార్థి యను విఖ్యాతిఁ గాంచినాఁడు. ఆయన బసనుండి మిడిల్ టెంపిల్ పదునొకండు మైళ్ళ దూరమున నున్నది. ప్రతిరోజు నడచి యంతదూరము వెళ్ళుచుండెను. వెళ్ళుటయే కాదు, అక్కడ దినమునకుఁ బదునేఁడుగంటలు చదువు చుండెనఁట. వేకువనే లేచి నిత్యకృత్యములు తీర్చికొని యక్కడనే యన్నపానీయముల నారగించువాఁడు. ఆయుఁ యధ్యయనములో నిమగ్నుఁడై యుండఁ దుదకు బంట్రోతువచ్చి టైమయిపోయిన దని చెప్పువఱకు లేచెడివాఁడు కాఁడు.

ఆయన కృషి ఫలించినది. ప్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁ డగుటయేగాక యేఁబదిపౌనుల విద్యార్థి వేతనముగూడ లభించి నది. ప్రశ్నపత్రముల కీయనవ్రాసిన సమాధానములు చూచి యా పరీక్షాధికారి యాశ్చర్యపడి ప్రధాన న్యాయాధిపతికి సిఫా రసు ఉత్తరముకూడ నిచ్చెను.

ఆయన నాఁడు నేఁడు కూడ నన్యాయమును సహింపఁడు. ఇంగ్లాండులో నుండు రోజులలో నాయన యొకరి యింటిలో బసచేసెను. ఆ పేదరాసిపెద్దమ్మ యొక ధనవంతుని కుమార్తెను బట్టుకొని తనకుఁ గొంతమొత్తమునకు చెక్కు వ్రాసి యిమ్మని బలవంత పెట్టసాగినది. ఈ సంగతిఁ బసికట్టి పటేలు పోలీసు వారిని దీసికొనివచ్చి యా పెద్దమ్మను బట్టించియిచ్చి యా పిల్లను వదలిపెట్టించెను.

బారిష్టరుపరీక్ష యైనతరువాత నాయన బయలుదేరి 1913 ఫిబ్రవరి 13 తేదిన బొంబాయి చేరినాఁడు. ఆ మఱుసటి దినముననే యహమ్మదాబాదులో నడుగుపెట్టినాఁడు. అక్క-

డనే కాపురముపెట్టి యపారముగ నార్జింపసాగినాఁడు. ఇంతలోనే యాయన జీవితవిధానము మఱియొక విధముగ మారవలసి వచ్చినది.

## తాఱుమాఱు

ఆంగ్ల విద్యాభ్యాసమువల్ల, ప్లీడరీవృత్తివల్లఁ బటేలులో క్షీణించుచు వచ్చిన జాతీయత పాశ్చాత్యదేశవాసమువల్లఁ బూర్తిగాఁ బోయినది. దొరల వేషభాషలు, రీతి రివాజులు బాగుగా నలవాటైనవి. పిల్లలనుగూడ నింగ్లండు పంపవలయునని తలంచి ముందుగఁ గాన్వెంటులోఁ జేర్చినాఁడు.

తాను జూట్టు, సిగరెట్టు, పలాస్, మధుపానముల కలవాటైనాఁడు. అన్నతో నప్పుడప్పు డనవసరమైన యర్థరహితమైన హాస్యాలకు దిగి ప్రొద్దుపుచ్చుచుండెడివాఁడు.

పదిమందితోఁ గలసి తిరుగకుండెను. పలుక కుండెను. కోరచూపులు చూచుచుండెను. ఆయన దగ్గరకు వచ్చిన వారితోఁగూడ మందహాసము చేయుటయేగాని పల్లెత్తి పలుకరించువాఁడుకాఁడు. తా నెక్కడనుండియో యూడిపడ్డట్లహంకారము చూపించువాఁడు. రాజభక్తి, బ్రిటను నందుభక్తి యూనాఁ డాయనలో నధికముగా నుండెను.

గుజరాతు క్లబ్బులో నాయన యొకసారి యీ విధముగాఁ జెప్పెను. 'దుర్గాపూజ పండుగనాఁడు నే నంతులేని యానందములో నిమగ్నుఁడనై యుండువాఁడను. ఆ పండుగను బట్టించుకొనువాఁడనే కాదు. వినోదమే నాకెక్కువ. భారతీయులు విదేశీయుల ననుసరించుటయే యభివృద్ధికర మార్గమని

తలంచుచుంటిని. నేను బాల్యశాలలోఁ జదివిన గ్రంథముల సారాంశ మేమన—మన దేశీయు లల్పులు, బుద్ధిహీనులు. మనపై రాజ్యముచేయు విదేశీయులు మనమేలు గోరువారు. వారే మన యుద్ధారకులు, ఉత్తములు. మన దేశీయులు వారిసేవచేసి బ్రతుకు బానిసలు. ఈ విద్యావిషప్రచారము దేశమందంతటఁ జేయఁబడినది."

1915 లో నహమ్మదాబాదులో గాంధీజీ సత్యాగ్రహము ప్రారంభించి స్థానికులైన పెద్దలను గలసికొనుటకై గుజరాతు క్లబ్బుకు వచ్చెను. అప్పుడు వల్లభాయి చీట్లాడుచుండెను. ప్రక్కనున్న మవలంకరు గాంధీజీ రాఁగానే యాయన కడకుఁబోగాఁ బటేలు గాంధిజీ నెంతో హేళనగా విమర్శించెను.

తరువాతఁ బటేలుకు మహాత్మునితో 1917 లో సన్నిహిత సంబంధ మేర్పడెను. అప్పటినుండి యాయన జీవిత విధానమే మారిపోయినది. ఆ దొరల వేషము, డాబు, దర్పము, రీతి రివాజులు పోయినవి. ధోవతి, యుత్తరీయము, లాల్చి, వేషధారణమైనది. వేషములోనే కాదు, అసలు వ్యక్తిలోనే మార్పు వచ్చినది. ఆనాటనుండి ప్రజలలో నాయన యొకఁ డైనాఁడు. ఒకఁ డగుటయే కాదు— ప్రజాసేవయే సర్వస్వమైనది. దేశభక్తియే యాయన మతమైనది. కార్యదీక్షయే యాతని లక్షణము. స్థితప్రజ్ఞత్వమే యలంకారము— వేయేల! ఆయన జీవిత విధానమే పరివర్తన చెందినది.

ఒకనాఁడు గాంధిజీని బరిహాసించిన పటేలు మఱొక నాఁడు గాంధీజీ సిద్ధాంతముల నాచరించువారిలో నగ్రశ్రేణికిఁ

పొందినాఁడు. అంధప్రాయముగ గాంధీజీ ననుసరించుచుంటి నన్నాఁడు. ఎంతెటి వింత! ఎంత తాలుమూలు!.

ఆయన పూర్వ ప్రస్తుత పరిస్థితులనుగురించి 1921 లో నొక సభయందు దిట్లు ప్రసంగించెను. "మొట్టమొదట నేను బోక్లిర్లాను. రసికుఁడను. రాజకీయములలోఁ బాల్గొనుటకంటెఁ జీట్లాటయే వేయిరెట్లధిక మనుకొంటిని. ఈ మోసపు రాజకీయములన్న నాకు సరిపడునదికాదు. కాని గాంధిమహాత్ముఁడీ కర్మక్షేత్రమునఁ గాలిడినాఁడు. ఆయన ప్రభావమువల్ల నేను మాఱిపోయి రాజకీయములోఁ జేరితిని."

అసలు విషయ మేమి యన, నాయన యెంత పాశ్చాత్య వ్యామోహములోఁబడినను, శత్రువులను జులుకన చేయవలెనను భావ మెంతయున్నను వీని యన్నిటికి వెనుక నొక యద్భుతమైన క్రియాశక్తి, యొక యఖండమైన సేవాభావము దాగి దోబూచు లాడుచుండెడిని.

ఆ సేవాభావమే, యా దివ్యశక్తియే, యాయన మిత్రులను, క్లయింటులను గొప్పగొప్ప యఘాతములనుండి తప్పించి రక్షించినది. పటేలు వారికి రక్షకుఁ డయ్యెను. మహాత్ముని ప్రభావమువల్ల నా పై పొరపోయి యాంతరంగికభావ మభివృద్ధిచెందినది.

మహాత్మునితో సన్నిహితభావ మేర్పడఁగానే తన బిడ్డలను గాన్వెంటులోనుండి మాన్పించి మహాత్ముని పాదముల వద్దఁ జేర్చినాఁడు.. పటేలు గాంధీజీ కన్నిటఁ గుడిభుజముగా నుండి యధికసమర్థతతోఁ బాటుపడుచుండుట నేటి ప్రపంచమునకు విదితము.

## వెట్టిచాకిరి

మహాత్ముఁడు గుజరాతులో రాజకీయజీవితము నారంభించగనే పటేలు కాయనయందధికవిశ్వాస మారంభమాయెను. దీనికిఁ దగినట్లుగానే 1916లో గుజరాతు రాష్ట్రీయ రాజకీయసభ గోధ్రాలో జరిగెను. దానికిఁ బటేలు కార్యదర్శి, మహాత్ముఁ డధ్యక్షుఁడు. ఆ సభలో నొక నిర్మాణకార్యక్రమ మేర్పఱుపఁ బడినది. ఆ కార్యక్రమ నిర్వహణమున కొక కమిటీ యేర్పడెను. వల్లభాయి యీ కమిటీకిఁ గూడఁ గార్యదర్శియయ్యెను. ఒక కార్యము చేయఁదలఁచికొన్నప్పుడు మీనమేషాలు లెక్క పెట్టుకొనుచుఁ గూర్చుండువాఁడు కాఁడు పటేలు. నీళ్లునమలుట యాయన ప్రవృత్తిలోనే లేదు. చేయఁదలఁచికొన్నపని చకచక చేయుటయే యాయన స్వభావము. ఆ ప్రాంతములో వెట్టిచాకిరి యధికముగా నుండెను. దానిని మొట్టమొదటగాఁ దుదముట్టించవలెనని పటేలు పట్టుపట్టెను. మహాత్ముఁడు చాంపరాను రయితులలోఁ బనిచేయుటకు వెళ్లియుండెను. కార్యభారమంతయుఁ బటేలుపైనే పడెను. ఆయన కమిషనరు కొక యుత్తరము వ్రాసెను. దానికి సమాధానము రాకపోవుటచేతఁ గమిషనరు కొక నోటీసు నిచ్చెను. వారము రోజులలో నీ నోటీసుకు సమాధాన మీయకపోయిన హైకోర్టు ఫైసలాయితా ననుసరించి, యీ వెట్టిచాకిరి శాసన విరుద్ధమైనదని భావించి, దీనిని మాన్పించుటకుఁ బ్రయత్నించెదనని సూచించెను. ఆరోజునే కమిషన రాయనను బిలిపించి పటేలు సూచన ప్రకారము వెట్టిని మాన్పించెను.

# కైయిరా సత్యాగ్రహము

గుజరాతు దేశములోని కెయిరా జిల్లాలో 1918లోఁ బంటలు పండక కఱవేర్పడినది. పండినను నెండినను బన్ను మాత్రము తప్పదని ప్రభుత్వముపన్నులకై రయితులను బెక్కుబాధలు పెట్టసాగిరి. రైతుదగ్గర డబ్బులేదు. విఠల్ భాయి మొదలగు నాయకులు లాసంవత్సరముపన్నులు రద్దుచేయవలసినదని వాదించిరి. కాని ప్రభుత్వము వారిమాటను బెడచెవిని బెట్టినది. పంట నాల్గవవంతుకుఁ దగ్గినఁ బన్నును వసూలు చేయరాదని ప్రభుత్వనియమములఁ గలదు. ఆ సంవత్సరము పంటలోఁ బాతిక వంతుకూడ లేదు. సర్కారుద్యోగులు పంటలు బాగుగఁ బండినవని వాదించసాగిరి. కాని యీ విషయమును బహిరంగముగ విచారించుటకుఁ బ్రభుత్వ మంగీకరించలేదు. ప్రభుత్వోద్యోగులు రైతులను బన్నులకై బాధలుపెట్టసాగిరి. అందుచేత రైతులు రక్షణకై గాంధిజీ నాశ్రయించిరి. రైతుల వాదము సరియైనదని మహాత్ముఁడు తెలిసికొని ప్రభుత్వముతో నీ విషయమును బరామర్శించెను. కాని ప్రయోజనము లేకపోయినది. అంతట మహాత్ముఁడు సత్యాగ్రహము ప్రారంభించెను. రయితులను జైలుకు బంపినను, నాస్తులు జప్తులు చేయించి వేలము వేయించినను ప్రభుత్వమువారు పన్నులు వసూలు చేయలేకపోయిరి.

చాంపరాను సత్యాగ్రములో రాజేంద్రప్రసాదు గాంధిజీకిఁ గుడిభుజముగానుండి పనిచేసినట్లే వల్లభాయి యీ సత్యాగ్రహములోఁ దన వృత్తిని వదలిపెట్టి యధికకృషిచేసి సత్యాగ్రహ విజయమునకుఁ దోడ్పడినాఁడు.

## అసహాయోద్యమము

1918 లో యూరపు మహాయుద్ధము ముగిసెను. ఈ యుద్ధములోఁ దిలకుగారు బ్రిటిషువారికి సహాయము చేయక పోయినప్పటికి గాంధిమహాత్ముఁడు పెక్కువిధములఁ దోడ్పడెను.

1919 లో ప్రజాస్వాతంత్ర్యమును గొంతుపిసుకుటకై ప్రభుత్వమువారు రౌలటు చట్టమును ప్రవేశపెట్టిరి. ఈ చట్టమును వ్యతిరేకించుచు గాంధిజీ సత్యాగ్రహము ప్రారంభించెను. దేశమునందంతటను హర్తాళములు, గొప్పగొప్ప సభలు జరిపి ప్రభుత్వ చర్యల కసమ్మతిఁ దెలిపిరి. ఈ సభలపై సర్కారువా రాశ్వికులదాడిని బంపిరి. కొందఱి నరెస్టుచేసిరి. పంజాబు ప్రముఖులగు సత్యపాల్, దునీచందు మొదలగువారిని బందీఁబెట్టిరి. పంజాబులోఁ బ్రశాంతిస్థితి నేర్పాటు చేయుటకు గాంధిజీ బయలుదేరఁగా నాయనను మధ్యమార్గమున నరెస్టు చేసి బొంబాయిలో దింపిరి.

1919 లో ఏప్రిలు 13 తారీఖున నమృతసరులో జలియనువాలా బాగునందు శాంతముగా సభఁ జేయుచున్న నిరాయుధులగు ప్రజలను డయ్యరుసేనాని దయారహితుఁడై మరఫిరంగులతోఁ గాల్చి చంపెను. పైగాఁ బంజాబు దేశమునఁ ప్రభుత్వమువారు సైనిక శాసనము ప్రయోగించిరి. ప్రభుత్వమువారి యన్యాయప్రవర్తనమునకుఁ గినిసి గాంధిజీ ప్రభుత్వమునకెట్టి సహాయము చేయరాదని ప్రకటించెను. గాంధిజీ యీ విధముగా దేశమంతటను దన యుద్యమమును బ్రచారము సేయసాగెను. ప్రజలలో నిది యధికముగ వ్యాప్తిఁగాంచెను.

తిలకట్ర్సు, నాగపూరు కాంగ్రెసులలో నసహాయోద్యమ మంగీకరింపఁబడినది. అసహాయోద్యమానుగుణముగఁ దన బారిస్టరువృత్తిని మాని తన పిల్లల నున్నత విద్యకై విదేశము లకుఁ బంపించుట విరమించుకొని గుజరాతులోఁ బహు లసహా యోద్యమ ప్రచారము ప్రారంభించెను. ప్రభుత్వమువారి దండన విధాన మతి కఠినముగా నుండెను. ప్రజలు దీనిని లెక్క సేయక యధికోత్సాహముతో నిందుఁ బాల్గొనజొచ్చిరి. గాంధిజీ వల్లభాయులు గుజరాతులో సత్యాగ్రహము ప్రారంభింప నహర్నిశలు కృషి చేయసాగిరి. బార్డోలీ, ఆనంద్ తాలూకాలు సత్యాగ్రహమునకై సర్వవిధముల నాయత్తము చేయఁబడినవి. బార్డోలీ నామము భరతఖండ మంతట విఖ్యాతిఁగాంచినది. చౌరాచౌరి హత్యాకాండ కారణముగా సత్యాగ్రహ మాపి వేయఁబడెను. గాంధిజీ యరెస్టు చేయఁబడెను. దీని యనం తరము గుజరాతు భారమంతయు వల్లభాయి భుజస్కంధముల పైఁబడెను. ఆయన గుజరాతు కేకైక నాయకుఁడు. ఆ దినములలో నాయన గుజరాతు విద్యాపీఠమునకై బర్మాకుఁ గూడ వెడలి దాదాపు పదిలక్షల రూపాయలు వసూలు చేసెను. 19/11/38.

## నాగపూరు సత్యాగ్రహము

1923 ఏప్రిలు 13 న జబల్‌పూరులో జాతీయవారము జరిపినారు. ఆ సందర్భములోఁ గాంగ్రెసు యువకులు మ్యునిసి పలు భవనముపై జాతీయ పతాకను ప్రతిష్ఠించిరి. పోలీసువారు దానిని లాగివేసి చించి పాఱవేసిరి. ఒక యూరపియను

డిప్యూటీ కమీషను రప్పుడు మ్యునిసిపల్ అధ్యక్షుఁడుగా నుండెను. అతఁ డీ సందర్భమునఁ జాల గర్వ్యముగాఁ బ్రవ ర్తించెను. అందుచేతఁ గౌన్సిలర్లందఱు వెంటనే రాజీనామాల నిచ్చిరి. జిల్లాకాంగ్రెసుసంఘము సత్యాగ్రహము ప్రారంభించెను.

యువజనులు జట్లుజట్లుగా వచ్చి జాతీయపతాకము. నా భవనముపైఁ బ్రతిష్ఠించుటయుఁ బోలీసులు లాగివేయు టయు జరుగుటయేగాక, వాలంటీర్లను ఖైదుచేయుటయు జరుగు చుండెను.

ఈ సంఘటనలే నెమ్మదిగా నాగపూర్కు ప్రాకెను. 1931 మే 1 వ తేదీన నాగపురములో నా నగరములోని సివిలు లైనులలోనికిఁ బోఁగూడదని 144 సెక్షను జారీచేసిరి. కాంగ్రెసు వాలంటీర్లు తమ యిష్టము వచ్చినవీధికి జాతీయపతాకమును దీసికొని పోవుటకు హక్కు కలదని పట్టు పట్టిరి. పోలీసులు వారి నరెస్టు చేసిరి. క్రమానుగతముగ నదియొక యుద్యమముగా నభివృద్ధి చెందినది. కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గమువారు నాగపూరు వాలంటీర్ల నభినందించిరి. నాగపుర సత్యాగ్ర హోద్యమ సంఘమువారికి సహాయము చేయుటకుఁ దీర్మా నించిరి. ఈ యుద్యమ సందర్భమున సేట్ జమ్నాలాల్ బజాజ్ కూడ నరెస్టు చేయఁబడెను. అందువలననే యఖిలభారత కాంగ్రెసుసంఘము నాగపురములో సమావేశమై పతాకోద్య మమునకు హృదయపూర్వకముగ సహాయముచేయుటకుఁ దీర్మానించిరి. నాగపురసత్యాగ్రహమునందుఁ బాల్గొనుటకు

వివిధ ప్రాంతములనుండి వాలంటీర్లు వచ్చి ఖైదులో నంతులేని బాధల నొందిరి.

పటేలు సోదరులు ముఖ్యముగ నా యుద్యమమున కండగా నిలఁబడిరి.

జులై 18 వ తేది పతాకాదినముగా నిర్ణీత మయ్యెను. కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము వారు నాఁడు దేశమంతటఁ బతాకోత్సవములు, నూరేగింపులు జరుపవలసినదిగా రాష్ట్ర కాంగ్రెసు సంఘములకుఁ దాఖీదులు పంపించిరి.

తదాజ్ఞానుసార మన్ని ప్రాంతముల యందును బతాకోత్సవము విజయోపేతముగ సాగెను. వల్లభాయి పటేలు కూడ జులై 18 తారీఖునఁ బ్రభుత్వము వారిచే నిషిద్ధప్రదేశముగా నిర్ణయింపఁబడినచోటఁ బతాకోత్సవము జరిపించెను. ప్రభుత్వము కిమ్మనలేదు. తరువాతఁ బ్రభుత్వమువారు సత్యాగ్రహుల నందఱను బేషరతుగా విడుదలచేసిరి.

# బోర్సద్ సత్యాగ్రహము

బోర్సద్ గ్రామము మరాజక వాదులకు దోపిడిగాండ్రకు నిలయమని చెప్పి ప్రభుత్వము ప్రత్యేకపుఁ బోలీసు సిబ్బంది నక్కడఁ బెట్టి, వారిపై 1922 లో రెండులక్షల నలుబదివేల రూపాయల యదనపు పన్ను శిక్షార్థము విధించిరి. ఇది చాల నక్రమమైన యారోపణము. ఈ దోపిడులు పోలీసువారి యుపాయావల్ల జరుగుచున్నవిగాని మఱియొకటికాదు. పోలీసుల తుపాకులుకూడ దోపిడిగాండ్ర యొద్దనుండెను. పటేలీ విషయ

మును గమనించి ప్రభుత్వమును హెచ్చరించెను. ప్రభుత్వము వల్లభాయి మాటను మొదటఁ జెవిని బెట్టెను. ఆయన నొక మాసము రోజు లక్కడ మకాము పెట్టి ప్రజలచే పన్నీయకుండ సత్యాగ్రహము చేయించెను. చట్టచివరకుఁ బ్రభుత్వము వారు హెచ్చింపఁబన్నును విచారణకుఁ బంపించిరి. ఆయన విచారణార్థము పన్ను విధించుట యక్రమమని రిపోర్టు వ్రాసెను. ఈ విధముగఁ బటేలు బార్డసులో నహింసాదళ విజయ పతాకను ప్రతిష్ఠించెను.

## అహమ్మదాబాదు మునిసిపాలిటీ అధ్యక్షత

స్థానిక సంఘములలోఁ బ్రవేశించ వచ్చునని కాంగ్రెసు తీర్మానించినది. తదనుగుణముగాఁ గాంగ్రెసు ప్రముఖ నాయకులు వానిలోఁ బ్రవేశించిరి. చిత్తరంజనదాసు, విఠల్ భాయి పటేలులు వరుసగాఁ గలకత్తా, బొంబాయి కార్పొరేషనులకు మేయరులైరి. రాజేంద్రబాబు పాట్నాకు, జవహరులాల్ నెహ్రూ అలహాబాదుకు, వల్లభాయి యహమ్మదాబాదుకు మ్యునిసిపలు అధ్యక్షులైరి. కాని వా రెక్కువకాల మీ పరిపాలనలోఁ బాల్గొనఁజాలక విడచిపెట్టవలసినవారైరి. వల్లభాయి మాత్ర మట్లు వదలిపెట్టలేదు. ఆయన దేనిలోఁ బ్రవేశించినను సగము సగముపనులు చేయఁడు. 1924 మొ॥ 1928 వఱకు నైదు సంవత్సరము లహమ్మదాబాదు పురపాలక సంఘమున కధ్యక్షత వహించి యెన్నో మార్పులు చేసెను. నగర పారిశుద్ధ్యమును బెంపొందింపఁ జేయుటయేగాక, ప్రయిమరీ పాఠశాలల యుపా

ధ్యాయులతో దేశభక్తిని రేకెత్తించి, వారి ద్వారా పిల్లలకు ప్రబోధము చేయించెను. మ్యునిసిపలు కమిషనరుకు నారోగ్య శాఖాధికారికి సింహస్వప్న మైనాడు.) ఆ పట్టణము సతిసమృద్ధతతో పాలించి దాని పెంపునకు బెడ్డ కృషిచేయుట యేగాక కాంగ్రెసు పతాక రంగులను లాంతరు స్తంభములను వేయించెను. వేయేల! అనతికాలమున గాంగ్రెసు నగరము గావించెను.

పటేలు అధ్యక్షుడుగా నుండుటకు మును దహమ్మదాబాదు కంటోన్మెంటు మునిసిపాలిటీకి నీటి పన్ను చెల్లించెడిది కాదు. పటేలు అధ్యక్షుడైన తరువాత 'పన్ను చెల్లించెదరా, నీళ్ళు బంధు చేయుమనా' యని తాఖీదు పంపెనాడు. అంతట కలెక్టరు 'మీతో మాట్లాడవలయును. ఎన్నింటికి వచ్చెద'రని కబురు చేసెను. దానికి బటేలు లిట్లు సమాధానము పంపెను. 'మీతో మాట్లాడవలసినపని నాకేమియు లేదు. నాతో మాట్లాడవలసిన యవసరము మున్నచో నా యాఫీసుకు వచ్చి మాట్లాడవచ్చును.' అంతట విధిలేక కలెక్టరాయన యాఫీసుకు వచ్చి నీళ్ళు వదలి పెట్టవలసినదిగా గోరెను. పన్నియనిదే నీరు వదలుటకు వీలు లేదని పటేలు పట్టుపట్టెను. కంటోన్మెంటు నీటి పన్నిచ్చు నాచారము లేదని కలెక్టరు వివరించెను. అట్లయినచో నీ పూటనుండి నీరు బంధు చేయుచున్నానని పటేలు బెదరించెను. కలెక్టరు గవర్నమెంటుకు వ్రాసి యా పన్ను చెల్లించెను. ఈ విధముగా బటేలిక్కడ విజయదుందుభిని ప్రయోగించెను.

## బాధితులకు సహాయము

1927 లోఁ బ్రళయము వచ్చినట్లు గుజరాతు నిలువెల మునుఁగిపోయెను. పటేలు పెక్కుమందివలంటీర్లను సమీకరించి ధన ధాన్యాలను సంపాదించి, పీడితులకు బహువిధముల సహాయము చేసి ప్రజలవల్ల నేగాక ప్రభుత్వమువారిచేఁగూడఁ బ్రశంసింపఁబడెను.

## బార్డోలీ సత్యాగ్రహము

"భూమిని దున్ని యితరుల ప్రాణములను బోషించునట్టి సాధనములను గల్పించువారిని దిండి లేకుండ మాడ్చి చంపి వేయునట్టి చావుకళ నిప్పటి రాజకీయవేత్తలు తమ యద్భుత రాజనీతిలోఁ గనిపెట్టిరి." —"రూసో"

వల్లభాయి కార్యక్రమ మంతయు స్థానికముగనే యుండెను. బార్డోలీ సత్యాగ్రహముకూడ స్థానికమేగాని దీని వల్లనే యాయన పేరు భారతదేశమందంతట విఖ్యాతమైనది. ఈ సందర్భములో నాయనకు మహాత్ముఁడు 'సర్దారు' అను బిరుదము నిచ్చెను.

అనేకులకు బిరుదు లీయఁబడినవికాని యాయనకంటె నర్హతతో బిరుద మార్జించినవా రరుదు. సర్దారు బార్డోలీలో నఖండవిజయము గాంచుట కాయనకు రైతుల యెడఁ గల యద్వితీయానురాగమే కారణము.

యథార్థ భారత స్వరూపము గ్రామములోనే కాన్పించు నని, వ్యవసాయదారుఁడే దానికి గీలకమని, రైతుకు సంబంధము లేని దే స్వాతంత్ర్యపథకమునకుఁగాని, పనికిఁగాని యర్థమే లేదని, భారతజాతీయతత్త్వ ప్రథమసూత్రము తొలిగా మన దేశములో మహాత్ముఁడు ప్రవచించెను.

దీని నక్షరాల నమలులోఁ బెట్టుటకుఁ దమ జీవితములను ధారవోసిన వారిలో మగన్‌లాల్ గాంధి, వల్లభాయి, ఆచార్య రంగా లగ్రగణ్యులు. గురువు సూత్రమును సృష్టింపఁగా శిష్యులు దాని నాచరించు పద్ధతులు కనుఁగొని యందుకై తమ జీవితముల నర్పించిరి. అందులో వల్లభాయి రంగాలకు మఱొక సదుపాయముకూడఁ గలసివచ్చినది. వారు రైతుబిడ్డలు. ఇంతియకాక వారిరువురు బాల్యములోఁ బొలాల యందుఁ బని చేసిన కృషీవలులు. అందుచేత నా భూపుత్రులతో వారి కన్ని విధముల సంబంధముండుటచే నభిమాన మధికము.

అందుచేతనే 'యీ పృథివిలో దలయెత్తుకొని తిరుగ నర్హుఁడైనవాఁడున్నచో నతఁ డొకరైతే. అతఁ డుత్పత్తిదారుఁడు. ఇతరులందఱు పందికొక్కులవంటివా'రని పటేలనఁగలిగినాఁడు.

ఇఁక నసలు విషయమునకు వత్తము. 1927లో బార్డోలీలో రీసెటిల్మెంటు జరిగినది. దీనివల్లఁబన్ను నూటికి ముప్పది రూపాయలు పెరిగినది. ఇందువల్ల రైతాంగములోఁ జాల నసంతృప్తి పెరిగినది. అందుచేఁ గొంత తగ్గించిరి. కాని యంతటితో రైతులు తృప్తిపడలేదు. తమకు న్యాయము జరుగలేదని నిష్పాక్షికమైన కమిటీని వేసి విచారింపుఁడని రైతులు కోరిరి. కాని ప్రభుత్వము పెడచెవిని బెట్టినది.

బార్డోలీ తాలూకా రైతుసభ జరిగినది. ఆ సభలో పన్నుల నిరాకరణమునకుఁ దీర్మానించుకొన్నారు. పటేలు సహాయమును గోరిరి. ఆయన వారితో "మీరు ప్రభుత్వమును ధిక్కరింపఁ బోవుచున్నారు. వారి శక్తిసామర్థ్యాలు పెద్దవి. అనేక కష్టనష్టములకు గురికావలసివచ్చును. ఇవి యన్నియు నాలోచించుకొనవలసిన"దని రైతుల ప్రతినిధుల సభలో చెప్పి (1928 ఫిబ్రవరి 4 వ తేది) యాలోచించుకొనుటకు వారి కెనిమిది రోజులు గడువిచ్చెను.

వారాలోచించుకొని తమ ప్రథమ నిర్ణయమునే మరలఁ జెప్పిరి. 1928 ఫిబ్రవరి 12 వ తేదిన తాలూకా రైతు సభ జరిగినది. రైతులందరు వచ్చి సత్యాగ్రహము చేయుటకే సమ్మతించిరి. అంతట నాయన తాలూకా యంతటను సంచారము చేసి వేలకొలఁది స్వచ్ఛంద సైనికులను జేర్చి చేయవలసిన యేర్పాట్లన్నిటిని జేసెను. ప్రతి గ్రామమునకు నొక నాయకుఁడు. తాలూకా యంతట నైదుగురు నాయకులు. వీరందరికి సర్దారు సర్వసేనాని. సత్యాగ్రహ కార్యాలయము స్థాపించి "సత్యాగ్రహ సమాచార్" అను దినపత్రికకూడఁ బ్రచురింపబడుచుండెను. ఆనాఁ డాయన యాజ్ఞలేకుండఁ బ్రభుత్వాధికారులకుఁ జిట్టెడుప్పుకూడ దొరుకలేదనిన నతిశయోక్తి కాదు. బార్డోలీలో బ్రిటిషుప్రభుత్వము నశించిన దని టైమ్సుఆఫ్ ఇండియా ప్రతినిధి ప్రకటించెను.

ఫిబ్రవరి 12 వ తారీఖు పన్నులకు గడువు. కాని ప్రభుత్వపు బొక్కసమున నొక్క పైసగూడఁ బోలేదు. అంతట వారు జప్తులు చేయసాగిరి. దానికిని రైతాంగము లొంగలేదు.

ప్రభుత్వమువా రొక కోమటిని బట్టుకొని పన్ని యనలసినదని ప్రతిబంధించిరి. లోకములో నందరకంటెఁ బిటికివాఁడని యను కోమటి నాయనపైఁ గఠకుదనము చూపుటచే, వారు నీలదీసిపరిపాలించు సూత్రము ననుసరించి యొక మహమ్మదీయుని బట్టుకొనిరి. ఆయనయుఁ బైసగూడ నియ్యలేదు. పఠానులను దీసికొనివచ్చి యనేక దౌర్జన్యములను జేయించిరి. ఏమి చేయించినను బ్రయోజనము లేకపోయెను.

ఇట్లు వారు పెక్కు బాధలకు లోనగుటయేగాక బార్డోలీతాలూకాలోని 80 వేల జైతాంగము ఇల్లు వాకిలి వదలి, బ్రిటిషుఇండియా దాటి, బరోడాసరిహద్దులను వలస పోఁ జొచ్చిరి. 80 యేండ్ల వృద్ధురాలు పటేల్‌తల్లి వంట చేయుచుండఁగా దానిని బోరలద్రోసి రాళ్ళు రప్పలు వేసిరి. ప్రజల నహింసాపథమునుండి తప్పించుట కనేకవిధముల రెచ్చఁ గొట్టిరి. కాని ప్రజ లచంచలులై యహింసామార్గమునే యంటి పెట్టుకొని యుండుట ప్రపంచచరిత్రలో నపూర్వము. బార్డో లీయే యహింసానీతికి నిలఁబడఁ గలిగినది. ఈ సత్యాగ్రహ యుద్ధములో మహిళామణులలోఁ జెప్పరాని చైతన్యము గలిగినది. వారుకూడఁ గదనరంగములోఁ గాలుపెట్టిరి. బొంబాయినుండి సోదరి మీఠూపెటిట్, శ్రీమతి సురాజ్ మెహతా ప్రభృతు లిందులోఁ బ్రవేశించి నారీశక్తిని ప్రపంచమునకు బ్రదర్శింపఁ జేసిరి. ప్రభుత్వమువా రరెస్టులు, జప్తులు వేలములు రాక్షసకృత్యములు చేయసాగిరి. వేలు ఖరీదుచేయు సుక్షేత్రములు . మిక్కిలి తక్కువ ఖరీదుకు వేలము పడఁ జొచ్చెను. తమ బిడ్డలకంటె నధికముగాఁ జూచుకొను రైతాం

గపు పశుసంతానము, వారి హస్తములనుండి పరాయివారికిఁ బోవలసివచ్చెను. పఠానులు చేయు రాక్షసకృత్యములకుఁ బరిమితి లేకుండెను. ఏమైనప్పటికి ప్రశాంతంగను స్త్రీపురుషు లద్భుత ధైర్య శాంతములతో నన్నియు సహించుచుండిరి. ఆ బార్డోలీ దృశ్యములను జూచుటకుఁ బోయిన ప్రముఖులు సర్దారునొక్క యద్భుత నిర్మాణనిపుణత్వమును, సంఘటనా శక్తిని ప్రజల త్యాగమార్గమును జూచి, విస్మయ చకితులైరి.

బార్డోలీ సత్యాగ్రహము యావద్భారత సమస్యగాఁ బరిగణింపఁబడి యన్ని ప్రాంతములనుండి యన్నివిధముల సహాయము సమకూర్పఁబడెను.

ప్రభుత్వమున కన్నివైపులనుండి యొత్తిడి కలుగుటచేతఁ జివరకు రాజీబేరమునకు రాక తప్పలేదు. బొంబాయి గవర్నరును పిలిపించుటయు గవర్నరు వల్లభాయికిఁ గబురుచేయుటయు జరిగినది. వల్లభాయి మఱి ముగ్గురు మిత్రులతోఁగూడ సూరత్‌లో గవర్నరును గలసికొన్నాఁడు. కలసిమెలసి వారు మాట్లాడినారు, కాని కార్యకారి కాలేదు. శాసనసభాసభ్యులు కొందరు రాజీమార్గముచేయఁ బ్రయత్నించిరి. ఈ సందర్భములో శాసనసభాసభ్యుఁడగు రామచంద్రభట్టు పన్నులవిధానము పునర్విచారణ జరుగువఱకుఁ బెంపుజేసిన మొత్తము నొకచోటఁ బెట్టుటకు సూచనచేసెను. గవర్నరు దీని నంగీకరించెను. అంతట రాజీజరిగెను. ప్రభుత్వము తిరిగి పునర్విచారణ చేయుటకుఁ బ్రకటించెను. ఇట్లు ప్రకటించుటయేగాక ప్రభుత్వమువారు జప్తుచేసిన భూమిని రైతులకుఁ దిరిగి యిచ్చి యీ సందర్భములో నిర్బంధింపఁబడినవారి నందఱను విడుదల జేసిరి.

బ్రిటిషుప్రభుత్వపు హయాములో నిట్టి విజయమున కిదియే ప్రథమము. ఈ బార్డోలీ విజయము భారతదేశపు నైతాంగములలో నధిక చైతన్యము కలుగఁజేసి యనేకోద్యమము లకు మూలమైనది. సర్దారుపటేలు ఖ్యాతి యీ విజయముతో విశ్వవిఖ్యాతమైనది. ఈ సందర్భములో (1938 నవంబరు 31) కృష్ణాపత్రికాప్రధాన వ్యాసమునుదహరించుట సముచితమని తలంచుచున్నాను.

## బార్డోలీ కథ

"సత్యాగ్రహ సమరములో నెనిమిది సంవత్సరముల క్రిందట బార్డోలీతాలూకా రైతులు చూపిన త్యాగసాహస ములు చరిత్రాంకితము లైపోయినవి. ప్రపంచేతిహాసములో నట్టియుదంతము మఱియొకటి యున్నదో లేదో సంశయాస్పదము. రైతులకును వారి భూములకును గల సంబంధ మతిసుగాఢము. ఏనాఁడో వారితాతలు ముత్తాతలు వానిని సంపాదించిపెట్టిరో! తరతరాలనుండి యనుభవించుచుండిన స్థిరాస్తులవి. పంటలు పండినను బండకపోయినను వానినే కనిపెట్టుకొని, సంసారముల నెట్టులో పోషించుకొని వచ్చుచుండిరి. యజమానిపాదము పైని బడునప్పటికి, భూమి యానందముతోఁ బొంగునని పెద్దలు చెప్పుదురు. అట్లనుసృతముగా, వంశపరంపరగాఁ బ్రేమామృత ధారవలె వచ్చుచుండిన భూములను, బార్డోలీ రైతులు, దేశము కొఱకు, స్వరాజ్యముకొఱకు, వదలుకొని, తామును, బిల్లలును, నిరాధారులై, గ్రామభ్రష్టులై, యెట్లు చెట్లుచేమలు

పట్టికో — ఆకసమంటి విహాయస్ప్రాంతికులను మనము చూచి లేమ వినలేము.

బార్డోలీ తాలూకాలోఁ బ్రజలు పలుదు పల పనుచున్నను ప్రభుత్వమువారు సెటిల్మెంటుచేసి పన్నులను హెచ్చించిరి. వ్యవసాయకులు నేఁటంత నిష్ఫలకష్టములకు యుల్లపకును తెలియును. తమ మొఱల ననేకవిధముల నధికారులకు విన్నవించుకొనిరి. దరఖాస్తులను పంపుకొనిరి. శాసనసభలోఁ బ్రతినిధులచేతఁ జెప్పించిరి. కాని యేమి చేసినను లాభములేక పోయినది. రైతు లెంతకాలము పస్తులుండఁగలరు? భూములుపండినంత పన్నులభారమును మోయలేక క్రుంగిపోయినవి. కాని యధికారులకు దయరాలేదు. ఆ నిస్పృహలో, నా నైరాశ్యాంధకారములో, వారి పవిత్ర హృదయములు దైవమునుగూర్చి యాక్రందించినవి. భగవంతుఁడు ఆర్తపరిత్రాత. దయాస్వరూపుఁడగు గాంధిమహాత్ముఁడు వారిముందుఁ బ్రత్యక్షమైనాఁడు. కాని వాని తరుణోపాయములు సామాన్యములైనవి కావు. వానిది త్యాగపద్ధతి. అహింసాపూర్వకమైన తపశ్చరణము. పన్నుల నిరాకరించి దానివలనఁ గలుగు బాధల నన్నిటిని శాంతముతో, నిగ్రహముతో ననుభవించుటకుఁ బ్రతిజ్ఞ పూనవలయునని ప్రబోధించినాఁడు.

ఈ రైతు లెక్కువ చదువుకొనినవారు కారు. వట్టి పామరులు. సంసార తాపత్రయములలోఁ జిక్కుకొనిన నిరుపేదలు. వీ రట్టి త్యాగపథమునకుఁ బూనగలరా? బ్రిటిషు అధికారులు ప్రచండశాసనులు. వారిది కేవలము పోలీసు రాజ్యము. సామ్రాజ్యమునంతను బిగించివేయఁగల బలాఢ్యులు

వాసు. అట్టి యనేకాపూర్వ్వపాలు నీ బీదరైతు లెట్లుపరోఁకసగలరు? మహాత్ముఁ డతిగంభీరవిశ్వాసి-ప్రకృతిలో సర్వాంతర్యామి లేనిచోటు లేదు. ప్రతి యిసుకరేణువునందు నమూల్యమైన లోహములు దాఁగియున్నవి. ప్రతి మొక్కలో నోషధిగుణము కలదు. ప్రతి మనిషియందును సర్వశక్తిమంతుఁడు మెలఁగుచునే యున్నాఁడు. హృదయము ప్రబుద్ధము కావలయును గాని, చీఁటినుండి వెలుఁగు రాఁగలదు. దౌర్బల్యమునుండి శక్తి పుట్టఁగలదు. దుఃఖమునుండి యానందము ప్రవహింపఁగలదు. మహాత్ముని ప్రబోధముచే నీ బార్డోలీ సామాన్యపామరకర్షకులు మహావీరులుగ వెలసిరి. త్యాగపథమున నగ్రేసరులైరి. బార్డోలీ తాలూకాయంతయు యజ్ఞభూమియైనది. స్త్రీజనము కూడ బద్ధకటియై యీ రణరంగమున దుమికినది. పన్నుల నిరాకరణ మను నస్త్రమును సంధించిరి. అంతటిలో నధికారులు వచ్చి పడిరి. బెదరించిరి. భేదోపాయము నవలంబించిరి. వారి పూరి గుడిసెలలోఁ జొరఁబడి యన్నము వండుకొను కుండలను సయితము లాగుకొనిపోయిరి. పిల్లలకుఁ బాలుకూడ లేకుండ బసువులను దోలుకొని పోఁజొచ్చిరి. ఆబాలస్త్రీవృద్ధముగా సందర నిండ్లలోనుండి తటిమి వేసిరి. కాని రైతులు చలించలేదు. ఏమి వచ్చినను రానిమ్మని యచ్చో నిలువఁబడిరి. సత్యాగ్రహమే వారి కవచము.

వారిలో బయలుదేరిన యేకీభావ మత్యద్భుతము. ఒక్క రైతుకుండఁ జీలిపోలేదు. గ్రామోద్యోగులు రాజీనామా లిచ్చిరి. జప్తు ఆస్తులను గొనిపోవుటకుఁ గూలీలుకూడ దొరకలేదు. ఎవరును బండ్లు కట్టరు. పశువులను దోలుకొని పోవు

టకును నెవరును రారయ్యె. బయటనుండి పఠానులను దింపిరి. వీరు బహు కఠినులు. వీరి విగ్రహములే యతిభయంకరములు. వీరి దర్శనమాత్రముననే రైతులు బెదరిపోవుదురని యధికారు లాశపడిరి. పోలీసువారు లాఠీలను ప్రయోగించిరి. మిలిటరీ పటాలములు ప్రదర్శింపఁబడినవి. కాని బార్డోలీలోఁ బ్రతి బాలుఁడును నొక్కొక్క ప్రహ్లాదునివలె హరినామ సంకీర్తనము చేయుచుండెను. స్త్రీలు సహితము కంటఁదడి పెట్టలేదు. అలనాఁటి శ్రీరామచంద్రునితో వనవాసమున కరిగిన సీతాదేవివలెఁ బ్రతి స్త్రీ తన భర్తతోపాటుగ నింటిని వదలి, గ్రామమువదలి, రాజ్యమువదలి, బరోడా బయళ్ళలోఁ జెట్లక్రిందఁ గాపురము పెట్టెను. అది వర్షాకాలము. కుంభవృష్టి కురియుచుండెను. బయళ్ళన్నియు జలమయము లయ్యెను. కాని యాఁడీసు ల[illegible], తడిబట్టలతో, నానీళ్ళలో నిలఁబడియుండిరే కాని, దిగులు పడలేదు. ఆ యాత్మశక్తి ప్రదర్శనము నిరుపమానము. ఏ గనొక పుణ్యాత్ములో యిట్టి త్యాగశీలమును బ్రదర్శించవచ్చును. కాని యలనాఁడు శ్రీ గోపాలుని వేణుగానమునకు మూఁగిన గోబృందములవలె కుటుంబకుటుంబములుగా, గ్రామ గ్రామములుగా, నీ జానపదులీ త్యాగభూముల కరుగుట దైవప్రేరితముగాక మఱియేమి?

అధికారులు విస్మయచిత్తులైరి. కాని వారిహృదయములు కరగలేదు. ఇంకను గఠినతరాస్త్రములను సంధించిరి. వారి భూములను వేలము వేయసాగిరి. కాని కొనువారేరి? దీనుల యుసురు కెవరు పాత్రులుకాగలరు? బయటనుండి ధనికులను రప్పించి, పదిరూపాయల పన్నుకొఱకు పదివేలుఖరీదు

చేయుభూములను గొట్టివేసిరి. ధనికులుకూడ జంకినప్పుడు, పోలీసువారి పేరుననే కొట్టివేసిరి. కొన్ని భూములకు బఠానులనే భూమందు బుసుగఁజేసిరి. ఘోరము! అతిఘోరము! అధికారు లీ దారుణ చర్యల నవలంబించినది కేవలము సర్కారు సొమ్మును రాఁబట్టుకొనుటకుఁగాదు. రైతుల పన్నెముఁకలను విఱుగఁగొట్టుటకుఁ, దమ ప్రతిష్ఠను నిలువబెట్టుకొనుటకు, తమ శాసనాధికార ప్రాబల్యమును బ్రదర్శించుటకు, నట్టి క్రూర కార్యములకైనను నొడంబడిరి. ఆనాడు బార్డోలీ రైతు లట్టి యపూర్వత్యాగసాహసములను జూపుచుండినప్పుడు, సిమ్లా కొండలుకూడఁ గదలిపోయినవి. ఒక్క తాలూకాలోనే పది గ్రామములవారో యిట్టి వీర్యాతిరేకమును జూపఁగలిగినప్పుడిక దేశములోని రైతుజనమంతయుఁ దలఁచుకొనిన ప్రభుత్వము లేమి కావలయును? బ్రిటిషుప్రభుత్వ మట్టుడికిన ట్లుడికి పోయెను. ఈ వృత్తాంతములను బత్రికలలోఁగూడఁ బ్రచురింప నియ్యలేదు. మహాదేవదేశాయి రచించిన "బార్డోలీ కథ"ను గవర్నమెంటువారు నిషేధించిరి.

ఆనాఁ డే నాయకు లీ బార్డోలీ వీరులను నడిపిరో, వారే నేఁడు ప్రభుత్వాధికారులైరి. సర్దారు వల్లభాయి కాంగ్రెసు మంత్రులకు సారథి. ఆనాఁ డీ దారుణచర్యలను సహించలేక, డిప్యూటీ కలెక్టరు పదవిని వదలివేసిన దేశాయిగా రిప్పుడు బొంబాయి ప్రభుత్వమునందు రివిన్యూమంత్రి. వీరికర్తవ్య మేమి? కాంగ్రెసును నమ్ముకొని నిరాధారులైపోయిన యా బార్డోలీ వీరుల నజ్ఞాతవాసమునుండియైనను రప్పించి వారి భూములను వారి కిప్పించుట భావ్యముకాదా? సామాన్యముగ యుద్ధానంత

రము, గొప్ప ధైర్యపరాక్రమములను ప్రదర్శించిన రైతాంగమునకుఁ ప్రభువులు పారితోషికము లిచ్చుట మరచిపోయిరి. ఇప్పుడు బార్డోలి రైతులు కోరుచున్న దట్టి బహుమతులు కావు. తమ పూర్వస్వత్వములను మరలఁ దిరిగి యిప్పించఁ గోరిరి. స్వరాజ్యము సిద్ధించిన పిమ్మట వారికిఁ గలిగిన యన్యాయమును తొలఁగింపవలెనని కాంగ్రెసు ప్రముఖు లప్పుడు వాగ్దానమును చేసియుండిరి. కాంగ్రెసు ఆజ్ఞలను శిరసావహించి, కాంగ్రెసు కీర్తిగౌరవముల నెన్నియోరెట్లు హెచ్చించి నిరాస్తులుగాఁ జేసిన, ఆ రైతుల యాస్తులను తిరిగి వారికిప్పించుట కాంగ్రెసు మంత్రుల విద్యుక్త ధర్మము. అప్పుడు దేశద్రోహులై, యమూల్యములైన భూముల నేరెండురూపాయలకో కొట్టించి చేర్చుకొని భూస్వాములైనవారికి గుణపాఠము చెప్పుట యవశ్యకర్తవ్యము.

కాంగ్రెసు మంత్రులు ప్రభుత్వాధికారమును చేఁబట్టిన వెంటనే, యీ యపచారమును దొలగించు టెట్లని యాలోచనకుఁ గడంగిరి. రివిన్యూ వేలములలో నన్యాయముగ గొనిన వారిచేత సౌమ్యమార్గములచే నా భూములను బార్డోలి రైతుల కిప్పించుటకుఁ బూనుకొనిరి. ఏ కొలదిమందికో తక్క నెక్కువమంది కట్టి సంస్కారము కలుగలేదు. వారు తమ లీగల్ హక్కులచాటున నిలుచుండి శఠించిరి. బొంబాయి మంత్రులీ లీగల్ చిక్కులను దొలఁగించుటకుఁ బ్రత్యేకముగ నొకబిల్లును దీసికొని రావలసిన యావశ్యకత యేర్పడినది. ఈ భూములకు గవర్నమెంటువారే కంపెన్సేషను నిచ్చుటకుఁగూడ నధికారమును బొందిరి. వేలములలో నన్యాయముగ నీ భూముల నార్జించిన వారికిఁ దగిన ప్రతిఫల మిచ్చికూడ వారినుండి

భూములను దిరిగి ప్రాంతఖామందుల కిచ్చివేసిరి. రైతులు తిరిగి తమ పిత్రార్జితములను బొందగలిగినందుల కానందభరితులగుచున్నారు. కాంగ్రెసువారు తాము వెనుకఁ జేసిన వాగ్దానములను జెల్లింపఁగలిగినందులకును సంతసింపవలసియున్నది. కాంగ్రెసుచేసిన శపథము నెగ్గితీరు నను విశ్వాసము ప్రజలలోఁ బ్రబలుటకు నవకాశము కలిగినది. ఇట్లే నా౯–కోఆపరేషనుతో గ్రామోద్యోగపదవులనుండి భ్రష్టులైన వారిని దిరిగి స్వపదస్థులుగఁ జేసినందులకు మద్రాసు ప్రభుత్వమువారును వంద్యులు. వెనుకటి ప్రభుత్వము వారొనర్చిన యనాచారములను గాంగ్రెసు మంత్రులు తొలగింప సమకట్టినను, బొంబాయి, మద్రాసు గవర్నరు లడ్డుపడక, వారి కర్తవ్య పరిపాలనకుఁ దోడ్పడఁగల్గుట యెంతయుఁ బ్రశంసింపఁదగిన విషయము. నేటికి బార్డోలీ వీరుల కథ యిట్లు మంగళకరముగ ముగిసినందులకు దేవతలు హర్షించెదరు. సత్యాగ్రహమున నెట్టి దివ్యశక్తికలదో యిప్పటికిఁ బూర్తిగ విశదమైనది"

# భాషాసేవ

సాంఘిక వ్యవస్థనుబట్టి భాషాస్వరూప మేర్పడును. రాజకీయ చైతన్యమునుబట్టి ప్రజలకుఁ బ్రభుత్వమునకు గల పద్ధతులు, సంబోధనలు, మాఱుచుండును. ప్రజాస్వామికము పెరిగినకొలఁది ప్రజాస్వామికభాష బాగుగా నభివృద్ధి చెందును. ఇందులోఁ బూర్వయుగములోవలె యజమాని, బానిస లని, పాలక, పాలిత భేదము, హెచ్చు తగ్గులు, లేక సామాన్య ప్రతిపత్తి చూపఁబడును.

ప్రతి రచయితకు నొక శైలియుండునట్లే గొప్పకార్యకర్త-ప్రముఖున కాయన మనస్తత్త్వమును, భాషణమునుబట్టి భాషణపద్ధతి యుండును. సర్దార్ పటేలు లాత్మగౌరవమునకు లవ్యక్తప్రతిబింబములని. కనుక నాయన స్వభావమునకుఁ దగిన భాష బార్డోలీలోఁ బ్రచారమైనది. ప్రజలలో నొక విశిష్టమైన ధైర్యము, సహనముల, యాత్మగౌరవము నధికమైనట్లుగానే, భాషావిషయములోఁ గూడ నట్టి పరాకాష్ఠ కలిగినది.

సబర్మతీ తీరానఁగూర్చుండి గాంధీజీ, బార్డోలీ పొలములలోనుండి వల్లభాయి, యభివృద్ధిచేసిన గుజరాతీ భాష సహజమైనదేగాక ధీరోదాత్తమైనది.

సాహిత్యము ప్రజల పరాక్రమప్రసాదము. "యథా భావక స్తథా భాషా." భాషించువానినిబట్టియే భాషయుండును. సాహిత్యోన్నతి ప్రజల యున్నతిద్వారానే కలుగును. ఏ పండితులు, కవులు నభివృద్ధి చేయలేని భాషావృద్ధి బార్డోలీ కిసానులు చేసిరి. ఈ యభివృద్ధి కాదిపురుషుఁడు వల్లభాయి.

## కాంగ్రెసులో

పటేల్‌కు 1916 లోనే గాంధీజీతోఁ బరిచయ మేర్పడినది. నాటినుండి యాయన ప్రజాసేవఁ బ్రారంభించెను. అందుచేతనే యాయన 1916లో లక్నోలో జరిగిన కాంగ్రెసుకుఁ బ్రతినిధిగా వెళ్లెను.

1918-19-21-22 సంవత్సరములలోఁ గాంగ్రెసుకు సంయుక్త కార్యదర్శిగాఁ బనిచేసెను.

1921 లో నహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెసు కాయన యాహ్వానసంఘాధ్యక్షుఁ డయ్యెను. ఆ యుపన్యాస మతి సంగ్రహమైనది. ఆ కాంగ్రెసులో ననేకసంస్కారములు జరిగెను. 1920 నాగపూరులోఁ గాంగ్రెసు జరిగినప్పుడు కుర్చీలు బల్లలు నేర్పాటు చేయఁబడుటచే నేఁబదివేలరూపాయలు ఖర్చయినవి. ఆపద్ధతి యహమ్మదాబాదులోఁ దీసివేయఁ బడుటయే గాక, కొంకులక్కల నివాసములలోఁ గాంగ్రెసుకొఱకు ఖద్దరుషేరా నిర్మింపఁబడెను.

1922 సంవత్సరములోఁ గాంగ్రెసులోఁ బరివర్తనవాదులు నపరివర్తనవాదు లని(Changers and No- Changers) రెండు పక్షము లేర్పడినవి. పరివర్తనవాదులపక్షమునఁ బ్రముఖులు చిత్తరంజన్‌దాసు, మోతీలాల్ నెహ్రూ, విఠల్‌భాయ్, శ్రీనివాసఅయ్యంగార్ ప్రభృతులు. అపరివర్తనవాదుల పక్షమున రాజాజీ, సర్దారుపటేలు, రాజేంద్రప్రసాద్, దేశభక్త కొండా వెంకటప్పయ్య ప్రభృతులు ముఖ్యులు.

పరివర్తనవాదులగు స్వరాజ్యపక్షమువారు, శాసనసభా ప్రవేశమునకై కాంగ్రెసులోఁ దీర్మానము చేయఁగోరుచుండఁగా నప్పుడు పటేల్ప్రభృతులు, శాసనసభాబహిష్కారమును, నిర్మాణకార్యక్రమమును సాగించుచు, మహాత్ముని మార్గమున నే కాంగ్రెసును నడిపించుటకు బద్ధకంకణులై కాంగ్రెసులోను; దేశములోను, నధికకృషిఁ జేసిరి.

1931 లోఁ గరాచీలో జరిగిన కాంగ్రెసుసభ కాయన యధ్యక్షత వహించెను. ఆయన తన స్వభావానుగుణముగా, ముక్తసరిగా నుపన్యాస మిచ్చెను. తన కధ్యక్షపదవి యిచ్చిన

గౌరవము, సామాన్యకృషీవలుఁడైన తనది కాదనెను. జాతీయ సమరమునం దెక్కువ పాల్గొన్న గుజరాతునకే యీ గౌరవము చెందునని కాంగ్రెసు సభ్యులవిధినిగూర్చి హెచ్చరించెను.

1935 లోఁ గాంగ్రెసు శాసనసభాప్రవేశ మంగీకరించుటచే సభ్యులను నిర్ణయించుటకును, వారి సమస్యలలోఁ బెట్టుటకును, పార్లమెంటరీబోర్డేర్పడెను. దానికిఁ బటేలు, రాజేంద్రప్రసాద్, అజాదు త్రిమూర్తులు నిర్ణయింపఁబడిరి. ఆ బోర్డు కధ్యక్షుఁడు పటే లగుటచేఁ గార్యభారమంతయు నాయనమీఁదనే పడెను.

ఆయన యారంభించిన పని మిక్కిలి పట్టుదలతోఁ జేయునని యందఱకుఁ దెలిసిన విషయమే. పటేలు భారతదేశమంతటఁ బర్యటనజేసి "కాంగ్రెసుకు వోటిచ్చుట యనఁగా గాంధీజీ కిచ్చుటయని ప్రజల కర్థమగునట్లు ప్రచారముచేసి, యభ్యర్థులను నిలిపెను.

కాంగ్రెసుకు వ్యతిరేకముగా దేశములో ననేకపక్షము లేర్పడెను. ప్రభుత్వమువారు పరోక్షముగా కాంగ్రెసు నోడించుటకు సర్వసన్నాహములు చేసిరి. ఎన్నికల సమయములో వివిధ పక్షముల గర్వోక్తులకు జవాబు చెప్పూచుఁ "గాంగ్రెసు స్టీము రోలర్ బయలుదేరిన, దానిని వ్యతిరేకించుఁ గంకరరాళ్లన్నియు నలిగి చూర్ణము కావలసినదే" యన్న పటేలుమాట యక్షరాల జరిగినది. ఎన్నికలలోఁ గాంగ్రెసు కఖండ జయము కలిగినది. సంయుక్త ప్రాంతము, బీహారు, ఒరిస్సా, మధ్య రాష్ట్రాలు, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో నధిక సంఖ్యాకులు కాంగ్రెసువా రగుటచేఁ గాంగ్రెసు మంత్రివర్గము

లేర్పడినవి. సరిహద్దురాష్ట్రమును, అస్సాములలోఁ గూడఁ గాంగ్రెసు మిశ్రమంత్రివర్గముల నేర్పాటు జేసెను.

కాంగ్రెసు ప్రాంతములలో శాసన సభా కార్యక్రమము నెఱవేర్చుటకుఁ బార్లమెంటరీ కమిటీ నొకదాని నేర్పాటు చేసెను. దీనికి వల్లభాయి యధ్యక్షుఁడు. ఈ హోదాలో నాయన కాంగ్రెసు మంత్రివర్గములతో మిక్కిలి దక్షతతో వ్యవహరించెను.

పార్లమెంటరీబోర్డు కధ్యక్షుఁడుగా సర్దారు చూపిన శక్తి సాహసములు చరిత్రాత్మకమైనవి. ఎక్కడనే కాంగ్రెసువాది నీతినిబంధనల నతిక్రమించెనని తెలిసినను నాతడు ప్రధాన మంత్రియైనను ప్రాథమిక సభ్యుఁడైనను జంకుగొంకు లేక వెంటనే యాజ్ఞాపత్రము నందఁజేసి యాయరాచకము నంతమొందించుటలో నారితేఱినవాడని పటే లఖండఖ్యాతిఁ గాంచినాఁడు.

బొంబాయి రాజధానిలో "నారిమన్" గొప్పనాయకుఁడు. సర్దారు కాయన ప్రాణస్నేహితుఁడు. అయినను నారిమ నెన్నికలలోఁ గాంగ్రెసుకు భిన్నముగాఁ బ్రవర్తించెనని తెలిసికొని యాయనను గాంగ్రెసునుండి వెడలఁగొట్టెను.

"డాక్టరు ఖరే" మధ్యరాష్ట్రములలోఁ బ్రధాన మంత్రిగాఁ గొంతకాలము పనిచేసినతర్వాతఁ బార్లమెంటరీ బోర్డుతో సంప్రదించకుండఁ దన యిష్టప్రకారము మంత్రులచేఁ రాజీనామా పెట్టించినప్పు డాయననుగూడఁ బటేలు పదవీచ్యుతుని జేసి కాంగ్రెసునుండి బహిష్కరించెను.

మన మాజీ ప్రధాని రాజాజీ, యూరపియన్ సెక్రటరీ సింఛను పుచ్చుకొని పోనున్న తరుణములో విందుఁ జేయఁ

ప్రయత్నించఁగా వల్లభాయి వల్లగాటని తొంతి నంస్థ యాపించెను.

సుభాషబాబు కాంగ్రెసుపాలసీకి భిన్నముగాఁ ప్రవర్తించినందుకు రెండు సంవత్సరములాయనను డిబారు చేసెను.

కాంగ్రెసవలంబించిన పద్ధతికి వ్యతిరేకముగా రాజాజీ ప్రచారము ప్రారంభించినప్పుడు శాసనసభ్యత్వమును వదలుకొనుమని యేగాక, కాంగ్రెసు నుండి తప్పుకొనవలసినదని యే తాఖీదు పంపెను. ఆప్రకారమే చక్రవర్తులవారు చేసిరి.

ఈ విధముగా వేయికండ్లతోఁ జూచుచుఁ గాంగ్రెసులోఁ గ్రమశిక్షణను గాపాడిన ఖ్యాతి యాయనకే యధికముగ జెల్లుబడియైనది.

స్వధర్మనిర్వహణలో మిత్రుఁడనిగాని, పెద్దయనిగాని తలఁచక, యాఁయనచూపిన కర్తవ్య నిర్వహణబుద్ధియే యాయన నధికునిగాఁ జేసినది. ఆయన ద్వంద్వాతీతుఁడై చేసిన సేవకుఁ గొందఱకుఁ గష్టము కలుగవచ్చును. కొందఱకు నష్టము కలుగవచ్చును. కాని కాంగ్రెసునుమాత్ర మాయన దుష్టాంగమును ఖండించి, శేషాంగమును గాపాడినట్లుగాఁ గాపాడినాఁడు. ఆయన యీ విధముగ దారుణచర్య తీసుకొనక పోయినఁ గాంగ్రెసు శాసనసభాపక్షము, స్వరాజ్యపక్షమువలె ఛిన్న భిన్నమై నశించిపోయియుండును.

ప్రభుత్వ మీ కాంగ్రెసు సభ్యులను లోఁబఱచుకొనుట కెన్ని మాయోపాయములు పన్నినను వాని నన్నిటిని వేయి కండ్లతోఁ జూచుచు నెప్పటికప్పుడు మెలకువతోఁ బటేలు సంచరించుటవలననే కాంగ్రెసు ప్రతిష్ఠ నిలచినది.

వ్యతిరేకు లాయనను ఫాసిస్టని, కులక్ అని, డిక్టేటరని, యుక్కుమానిసి యని యెంత నిందించినను నాయన వాని నన్నిటి నోర్చి, కాంగ్రెసులోఁ గ్రమశిక్షణ యతిజాగ్రుతితో సలిపి కాంగ్రెసును గాపాడుటలో సఫలఖ్యాతిఁ గాంచెను.

తాఖీదు లిచ్చుటలోనే తనపని పూర్తియైన దనితలంచు ఘటముకాదు పటేలు. తాను బూనినకార్యము, నెగ్గునవఱకు నిరంతరప్రయత్నము చేయు నిరుపమాన కార్యదక్షుఁడు. బొంబాయిలో మద్యపాననిషేధోద్యమమునకు వ్యతిరేకముగాఁ గంట్రాక్టరులగు పార్సీలు మొదలగువారు పలుప్రయత్నములు చేయఁగా నచటఁ బ్రవేశించి మద్యపాననిషేధోద్యమము నమలుజరిపించి జయప్రదముగాఁజేసిన యాయన భగీరథప్రయత్నము భారతలోకమునకుఁ దెలియనిది కాదు.

అండమాను రాజకీయబందీలు నిరశనవ్రత మవలంబించఁగా వారిని వదలిపెట్టుటకుఁ గేంద్రప్రభుత్వమున కిష్టములేకపోయినను, వారిని విడిచిపెట్టుటకు వీలులేకపోయినను మన కీ రాష్ట్రీయస్వాతంత్ర్య మెందుకని హెచ్చరించి, వారిని విడచి పెట్టించిన స్వాతంత్ర్యప్రియుఁడు సర్దారు.

1945లోఁ గేంద్రశాసనసభాధ్యక్షపదవికిఁ గాంగ్రెసు మవ్లంకరును నిలుపగా, ముస్లింలీగువారు, ప్రభుత్వము భుజాలు భుజాలు కలిపి పనిచేయఁగా నక్కడఁ బీఠము పెట్టి మవ్లంకరును బీఠమెక్కించి ఢిల్లీకోటలో బాగా వేసిన విజయసారథి — సర్దారు.

కాంగ్రెసులో నాయనపాత్ర యతిప్రముఖమైనది. క్రిప్సు రాయబారములో నేమి, యమాత్యత్రయదౌత్యములో

నేమి, యాయన కాంగ్రెసు రాయబారిత్రయములో (నెహ్రూ అజాద్) నొకఁడై కాంగ్రెసుప్రతిష్ఠకుఁ దగినట్లుగా నడిపిన సంగతి సర్వజనవిదితము.

ఆయన కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యుఁడేగాదు. కాంగ్రెసు మహాప్రధానులలో నొకఁడేనాఁడు. గాంధిజీ తర్వాత కాంగ్రెసువిధాననిర్ణేతలలో నగ్రస్థానము వహించినవాఁడు.

## అన్నదమ్ములు

కాంగ్రెసులోఁ బ్రఖ్యాతి గాంచిన నాయకులలో నన్నదమ్ములజంటలు కొన్నిగలవు. ఆలీసోదరులు, బోస్ సోదరులు, ఖాన్ సోదరులు, పటేల్ సోదరులు ప్రఖ్యాతులు.

ఆలీసోదరులలోఁ బెద్దన్నయ్యా సౌకతాలీ భీమాకారుఁడు. ఆయన యాకారమే రాజద్రోహకర మైనదని యాయన యనుచుండెడివాఁడు. విందుహృదయుఁడు. ఆయనతమ్ముఁడు మహమ్మదాలీ యఖండప్రతిభావంతుఁడు. ఆలీసోదరు లిరువురు మహాత్మునకు ఖిలాఫతుద్యమములో నేకీభవించిచేసిన స్నేహము ప్రచారము ప్రబోధము, చరిత్ర ప్రసిద్ధమైనవి. వారిరువురు వామనమూర్తియగు గాంధీమహాత్మున కంగరక్షకులై యనుయాయులై, వర్తించిన విషయము విశదమే. అందులో మహమ్మదాలీ 1923లోఁ బ్రథమముగా నాంధ్రదేశమునఁ గాకినాడ కాంగ్రెసుసభ కధ్యక్షుఁడైనాఁడు. కాంగ్రెసధ్యక్షోపన్యాసములలోనికెల్ల నాయన యుపన్యాస మతిదీర్ఘమైనది. ఆ దీర్ఘబాహువునకుఁ దగినట్లుగానే యది యున్నది.

ఖాన్ సోదరులు సరిహద్దురాష్ట్రపు కాంగ్రెసు భక్తులు. మహాత్ముని మిత్రులు. ఈశ్వర సేవకులు. వారి కుటుంబము 1857 సం॥లో జరిగిన స్వాతంత్ర్యసమరములోఁ బ్రభుత్వమున కండయై నిలచి, చేసిన పాపపరిహారార్థ మీనాటి స్వాతంత్ర్య సమరములో నా కుటుంబమంతయు నాహుతియై యధికఖ్యాతిఁ గాంచినది. వారిలోఁ బెద్దవాఁడగు ఖాన్ సాహెబ్ గొప్ప పాణ్డిత్యం పేరిమను. కేంద్రశాసనసభలో సభ్యుఁడుగను, సరిహద్దురాష్ట్రములో సచివుఁడుగను నుండి, యాయన చేసిన సేవ విఖ్యాతమైనది. చిన్నవాఁడగు గఫూర్ ఖా నీశ్వరసేవక సంఘము నేర్పాటుజేసి నిర్మాణకార్యక్రమములో నిరుపమాన కార్యదక్షతను జూపి, యనక్రపరాక్రమశాలురైన పఠానులలో నహింసాసిద్ధాంతము నమలులోఁబెట్టి సరిహద్దుగాంధీ యని ఖ్యాతిఁగాంచిన యహింసామూర్తి. కాంగ్రెసధ్యక్షపదవి నంగీకరించని నిరాడంబరుఁడగు సేవాతపస్వి.

బోస్ సోదరులలోఁ బెద్దవాఁడగుశరత్ చంద్రబోసుకూడఁ బార్లమెంటేరియను. బెంగాలు శాసనసభలోను కేంద్రశాసనసభ కాంగ్రెసు నాయకుఁడుగను నాయన ఖ్యాతిఁగాంచినాఁడు.

ఆయన యనుంగు సోదరుఁడగు సుభాష బాబు బ్రహ్మచర్యము స్వీకరించి దేశభక్తి వ్రతమును బూని స్వరాజ్య కంకణమును ధరించిన విప్లవమూర్తి. కాంగ్రెసు బహిష్కరించిన రోజులలోఁగూడఁ బ్రజాభిమానమును జూఱగొన్న ప్రజానాయకుఁడు. ప్రభుత్వమువల్లఁ బెక్కు బాధలు పొందిన దేశభక్తుఁడు. ప్రభుత్వమునకుఁ బ్రక్కలో బల్లెమై ప్రవర్తించిన యోధుఁడు. తన జీవితమంతయు దేశమున కర్పించిన

మహాత్యాగి. కట్టుగుడ్డలతోఁ బ్రభుత్వమువారి కండ్లలోఁ గారముగొట్టి కాని దేశముపోయి యజాద్ హింద్ ఫౌజును స్థాపించి, భారత స్వాతంత్ర్యమును బ్రకటించిన వీరాగ్రణి నేతాజీ యన్న యీయన నామము సార్థకము.

మనపటేలుసోదరులలో విఠల్ భాయిపటేలు పెద్దవాఁడు. ఆయన గొప్ప వార్లమెంటేరియనే. అఖండ ప్రతిభావంతుఁడు, గొప్పవిమర్శకుఁడు. విధ్వంసనములో నధికుఁడు. స్వరాజ్యపార్టీ ప్రముఖులలో నొకఁడు. బొంబాయి మేయరుగాను నాగపూరు జెండాసత్యాగ్రహములోను, నింకను పెక్కువిషయముల నాయన సేవఁజేసినను భారత కేంద్ర శాసనసభాధ్యక్షుఁడుగా నాయన ప్రదర్శించిన ప్రతిభావిశేషములు, స్వాతంత్ర్యనిరతి, యనన్య సామాన్యమైనవి. ప్రత్యర్థిశక్తులపై నాయనపొందిన విజయము లనంతములు. ప్రెసిడెంటు పటేలనుపేరున నాయన ప్రఖ్యాతుఁడైనాఁడు. ఆయననామము స్వాతంత్ర్యసమరచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది.

పైని చెప్పిన సోదరత్రయములో నన్నలకంటెఁ దమ్ము లధికసేవావ్రతులు, ప్రతిభావంతులు, విఖ్యాతులుకూడ. మనపటేలు సోదరులలో, నిరువురు నిరువురే. ఒకరినిమించిన వారొకరు. పెద్దపటేలు కోటలోఁ బ్రవేశించి పోరాడినఁ జిన్నపటేలు కోటబయటనుండి పోరాడినాఁడు. ఉభయులు సమాన శక్తియుక్తులు కలవారే. కాని భిన్న ప్రవృత్తులు కలవారు. కనుకనే భిన్నమార్గము లవలంబించినారు. మార్గములు భిన్నములైనను నాదర్శ మొక్కటే.

ఆ యన్నదమ్ము లిద్దరకు నొకరితో నొకరు వైరుధ్యభావ మున్నట్లు గోచరించుచుండువారు, కాని యీ విరుద్ధభావమునకు వెనుక నొక ప్రేమవాహిని ప్రవహించుచునే యుండెను.

## తండ్రికిఁ దగిన తనయ

సర్దారునకు 1905 లో నొక కుమారుఁడు గలిగెను. ఆయన పేరు దయాభాయి. ఆయన కూడ శ్రీకృష్ణజన్మస్థానమున కరిగినవాఁడే. ఆయన కుమారుని కంటె విఖ్యాతయైన దాయన కుమార్తె మణిబెన్. (1907) నిజముగా నామె మణివంటిది. ఆమె గాంధీజీని ప్రథమముగా దర్శించినప్పుడు చేతిబంగారు గాజులుతీసి బాపూజీకి సమర్పించినది. అవి స్వీకరించి "స్వరాజ్యము వచ్చునంతకు మరల నీవు గాజులు ధరించరాదు. దేశ సేవలోనే నిమగ్నురాలవై యుండవలయు"నని గాంధీజీ హితోప దేశము చేసెను. ఆమె దానిని ద్రికరణశుద్ధిగా నంగీకరించినది. నాటినుండి యామె సుఖలవవతలను దోసినది. భోగాలను వీడినది. ఇంతేగాదు. వివాహమే మానినది. బ్రహ్మచర్య మవలంబించి త్రికదీక్షతో దేశసేవ చేయుచున్నది. తండ్రికిఁ దోడుగా నిలచి స్వాతంత్ర్యసమరములో ముందడుగు వేసినది.

మణిబెన్‌లోఁగల యీ దివ్యభావమును, త్యాగమును జూచి, లోకము విస్తుపోవును. ఎక్కడివా యీ పోకడలని యాశ్చర్యపడును. కాని యామె జన్మించిన వంశములోని సేవాభావమును గమనించిన నా యనుమానము పటాపంచలై పోవును.

గాంధీజీ యన మణిబెన్‌కు భగవంతుఁడని నమ్మకము. అందుచేతనే యాయన యాశీర్వాదము పొందుటలో, నాయన చెప్పినచొప్పున యత్నములఁ బ్రవర్తించుటలో, నామె ప్రసిద్ధురాలు. గాంధిమహాత్ముఁడు, లోకప్రఖ్యాతిఁ గాంచిన రాజకోట సమరము సాగించు రోజులలోఁ గస్తూరిబా గోపాటూ యుద్ధము లోనికి దుమికిన దీ వీరాంగన. తండ్రికెఁ దాసు భక్తిగల కుమార్తెయై సేవచేయుటమాట యట్లుంచి, యాయన కెప్పుడు నండగా నిలచి రాజకీయములలో నెన్నోవిధములఁ దోడ్పడు చుండును మణిబెన్. మహదేవ్ దేశాయి గాంధీజీకి, హయామా యూన్ కబీరు అబ్దుల్ కలాం అజాద్‌కు, ఉపాధ్యాయ నెహ్రూకుఁ గార్యదర్శులై వారి ప్రతిభలను ధారవోసి, వారి నాయకుల కీర్తిఖ్యాతులకుఁ బాలుపడినట్లే, సర్దార్ జీకి మణిబెన్ కార్యదర్శినియై తండ్రికిఁ దగినఖ్యాతిఁ దెచ్చినది.

ఆమె యాయనకుఁ గార్యదర్శిని యేకాదు. అంగరక్షకురాలుకూడ. అంగరక్షకురాలే కాదు. తనయయై, తల్లియై, సర్దార్ పటేలును సాకుచున్న సేవావ్రతురాలు.

ఆయన యాహారవిహారములలో జాగ్రత్తఁ దీసికొని యాయన యారోగ్యమును గాపాడుటేగాక, దర్శకుల కనుమతి నిచ్చి యాయన కలసట లేకుండ ననుక్షణ మధికజాగ్రత దీసికొనుచుండు దాది.

వేయేల? ఆయన కామె కార్యదర్శిని, అంగరక్షకురాలు, తనయ, సమాలోచనకర్త్రి, సలహాదారు.

ఆమె వర్కింగు కమిటీ సభలకేకాదు. మంత్రాలోచన సభలకుఁగూడ వెళ్లునందురు. తండ్రిని విడచి యామెయుండదు.

ఇంతేగాదు, ఆయన పలుకు ప్రతిపలుకు లిఖితరూపమున వ్రాసిపెట్టును. ఆయన కిచ్చు సన్మానపత్రములు దాచలేక యాయన కార్యసిద్ధి కార్థికముగా సహాయముచేయుట సముచితముకాదా యని సలహా లిచ్చుచుండును.

మాతృదేశమునకై పితృసేవకై, స్వసుఖము పీడిన త్యాగమూర్తి. ఇట్టి తనయుని గన్న తల్లిదండ్రులు ధన్యులుగదా!

## గురువుతో

గాంధీజీ రాజకీయాకాశములో షోడశకళలతో వెలింగినప్పుడాయనచుట్టు ననేక నక్షత్రాలు గుమిగూడి ప్రకాశించినవి. గాంధీయుగములో గణనంగాంచిన విశిష్టమహాపురుషుఁడు పటేలు.

మహాత్మునిశక్తి, కార్యదక్షత వల్లభాయిలోను, సేవా వినయము రాజేంద్రబాబులోను, మేధ, తత్వజ్ఞానము రాజగోపాలాచారిలోను, విరాజిల్లినవని యొక్క విఖ్యాత పురుషుఁడు వచించినాఁడు. ఇందులో సత్య మధికముగానున్నది. *"బహుశః భారతదేశమంతటిలోను వల్లభాయికంటె నెక్కువభక్తుఁడైన సహచరుఁడు వేఱొకఁడు లేఁడు. అత డతిశక్తిమంతుడు; తనపనిలో భీష్మప్రతిజ్ఞకలవాఁడు. అయినను గాంధీజీయెడల స్వామిగను, నాయన యాదర్శము నెడలను, నీతియెడలను, భక్తిగలవాఁడు."

* నెహ్రూగారి ఆత్మకథ, 422 పుట.

గాంధీజీని కండ్లుమూసికొని యనుసరించుచున్నాఁడు. అది మహాత్మునియం దాయన భక్తివిశ్వాసములకు నిదర్శనము. అయినను బటేలుకు స్వకీయాభిప్రాయము, యుక్తాయుక్త విచక్షణ లేవని తలఁచరాదు. గాంధీజీ యాజ్ఞలన్నిటిని శిరసావహించునని తలఁపరాదు. ఎదురుతిరిగిన ఘట్టాలు లేకపోలేదు. భిన్నాభిప్రాయములను వెలిబుచ్చుటయుఁ గలదు. గాంధీజీ పావలాచందాబదులు నూలు తీయవలయునని ప్రతిపాదించినప్పు "డిఁకఁ దమరు తప్పుకొన్న బాగుగనుండు"నని నిర్మొహమాటముగా నన్నాఁడు.

గాంధీజీ యహింసావాది. యుద్ధమునకు వ్యతిరేకి. అయినను బటేలు 1944 లో మహాత్ముని యభిప్రాయమునకు భిన్నముగా జాతీయప్రభుత్వ మేర్పాటైన, యుద్ధమునకు సహాయము చేయుదుమని చెప్పెను.

గాంధీజీ యెదుట నరమర లేకుండ సరోజినివలె హాస్యమాడుట కాయనకే గుండెగలదు. పైగా నా హాస్యము నందరకన్న నాబోసినోటి తాతయే యధికముగా నాహ్వానించువాఁడు.

గురువును మించిన శిష్యుఁడు. గాంధీజీ "క్విట్ ఇండియా" తీర్మానము ప్రతిపాదింపఁ దాను 'క్విట్ ఏషియా' తీర్మానము ప్రతిపాదించిన ప్రఖ్యాతుఁడు పటేలు.

గాంధీజీ యాదర్శమును సూచింపఁ బటేలు సాధనమార్గమును జూపించువాఁడు. నడుముకట్టుకొని కార్యరంగములోఁ గర్మవీరుఁడై విహరించువాఁడు.

గాంధీజీతో నప్పుడప్పుడు స్వాతంత్ర్యసంపాదనలో నభిప్రాయభేదము ప్రకటించినను గాంధీజీని కాంగ్రెసు సంఘము

నుండి తప్పుకొమ్మని పలికినను నా గురువునందుండు భక్తివిశ్వాసములను వీడలేదు. పైగా నాయన కార్యక్రమము కాంగ్రెసులోఁ బటిష్ఠముగా నుంచుటకు బ్రతినపూని పనిచేసినవాఁడు పటేలే. సోషలిష్టు, కమ్యూనిష్టులను దుయ్యఁబట్టి మార్క్సుజంకంటె గాంధీయిజమే ఘనమైనదని ప్రకటించిన గురుభక్తిగలవాఁడు.

ఇటులనే గాంధీజీకూడఁ బటేలును బుత్రసమానునిగాఁ ప్రేమించువాఁడు. ఆయన ఘనత వెల్లడించినదికూడ మహాత్ముఁడే.

ఒక్కమాటలో, వారిరువురనుగుఱించి వివరించవలెనన్న గాంధీజీ యాత్మ, పటేలుశరీరము. గురుశిష్యులకుఁగల సంబంధమును స్వయముగా సర్దారుపటేలిట్లు చెప్పుకొన్నాఁడు.

* "మన స్వాతంత్ర్యోద్యమమున కంతకు గాంధిమహాత్ముఁడే యేకైకనాయకుఁడని మీవైస్‌చాన్సలర్ చెప్పినమాటలతో నేకీభవించుచున్నాను. ఆయనచేసిన తపస్సువల్లనే మనకీ స్వాతంత్ర్యము సిద్ధించినది. నేనుమాత్ర మాయన యాజ్ఞలను విధేయతతో శిరసావహించిన యొకసామాన్యసైనికుఁడను. గాంధీజీని గ్రుడ్డిగా ననుసరించు ననుచరుఁడని నన్ను గుఱించి యొకప్పు డందఱు తలపోయువారు. కాని గాంధీజీ నమ్మకములతో, నే నేకీభవించినందువల్లనే యాయన యడుగుజాడలలో నడుచుచున్నానని యాయనకును దెలియును, నాకును దెలియును. చర్చలన్నను వాగ్యుద్ధములన్నను నాకు గిట్టదు. దీర్ఘచర్చలన్న నాకుఁగంటగింపు. అనేకసంవత్సరములపాటు గాంధీజీ నేను

---

* కాశీ విశ్వవిద్యాలయ ప్రత్యేక స్నాతకోత్సవములో సర్దారుపటేలు 1948 నవంబరు 25 చేసిన ప్రసంగములోని భాగము.

నేకాభిప్రాయులమై యున్నాము. కాని స్వాతంత్ర్యప్రాప్తి విషయములో మాత్రమే మా యభిప్రాయములు భేదించినవి. అప్పటికప్పుడే స్వాతంత్ర్యమును బొందితీరవలయునని నే నభిప్రాయపడితిని. ఎంతో హృదయసంశోధనము చేసికొన్న పిమ్మటఁ గాని, యెంతో విచారించిన పిమ్మట గాని, నేనీ నిర్ణయమునకుఁ రాలేదు దేశవిభజనకుఁ గనుక నంగీకరించకపోయిన పక్షములో భారతదేశమంతయు భిన్నభిన్నమై సమూలముగా నశించిపోవునని నాకుఁ దోఁచినది...... కాని గాంధీజీ యీ నిర్ణయముతో నేకీభవించలేదు. కాని యీ నిర్ణయము సరియైనదే యని, దోషరహితమైనదని, నామనస్సునకు విశ్వాసము కలిగినట్లయిన నాలాగే వ్యవహరించవలసినదని గాంధీజీ నాకుఁ జెప్పెను. తనవారసుఁడుగా గాంధీజీ నిర్ణయించిపోయిన మహాపురుషుని సాహచర్యము నాకుండనే యున్నది. మా నిర్ణయమును గాంధీజీ ప్రతిఘటించలేదు. అయిన నాయన దాని నామోదించలేదు. ఆనాఁడు మే మట్టి నిర్ణయము చేసినందుకీనాఁడుకూడ నే నేమియుఁ బశ్చాత్తాపము పడుటలేదు. కాని మన సహోదరులు కొంతమంది మననుండి వేఱుపడిపోయినందులకుఁ జింతించితిమి.

మహాత్ముని మరణానంతరము ప్రజలకు సర్దారు పటేలు చేసిన యుద్బోధ స్మరింపఁదగినది. దానిలోని కొన్ని భాగాలు.

"ఈరోజు జరిగిన యీ సంఘటనకు మనము విచారమును వెలిబుచ్చవలసినదే కాని క్రోధమును జూపఁగూడదు. క్రోధము వచ్చిన నది మానవులను మఱపించును. ఇంతవఱకును మనము నేర్చుకొన్న మహాత్ముని బోధన లన్నిటిని, విస్మరింపఁ జేయును.

మహాత్ముని సలహా నాయన జీవితకాలములో, మన మనుసరించ లేకపోతిమని చెప్పుకో గూడదు. మన భారత దేశ ప్రతిష్ఠకే యది భంగకరము.

మన మింతవరకు నెంతగా బాధపడినప్పటికి మన కిది పరీక్షా సమయమని మఱచిపోఁగూడదు. మనలో మనకు భేదము లేకుండ నైక్యముతో ధైర్యముగా నిలువఁబడవలయును. ఇంత వఱకు భారత దేశముమీఁదనున్న బాధ్యత చాల గొప్పది. మహాత్ముని సహాయమే లేకపోయిన నా బరువుతో మన వీపులు ముక్కలై యుండును. ఆ సాయము మనకు నేటితోఁ బోయినది. మహాత్ముఁడు భౌతికరూపములో మనకుఁ గనపడక పోయినప్పటికి నాయనబోధన లన్నియు మన హృదయములలో నున్నవి. కనుక నాయన మనలోనే యుండును. రేపు సాయంత్రము 4 గంటలకు మహాత్మునికి దహనసంస్కారము జరుపఁబడును. కాని యాయన యాత్మ మనతోనే యెల్లప్పుడు నుండును. మహాత్ముని జీవితకాలములో సిద్ధింపఁ జేసుకో లేని వన్నిటి నింకనుండియైన సిద్ధింపఁజేసికొనవలయును.

యువకులందఱు తమ విధి నిర్వహణకు సిద్ధపడవలయును. మహాత్మునిచేఁ బ్రారంభమైన కార్యమును సమైక్యముతో సాధించవలయును."

## కటకటాల మధ్య

గాంధీజీ దండిసత్యాగ్రహము సాగించినప్పుడు వల్లభాయి యాయనకు ముందుగా సమరమునకు గుజరాతు కిసానుల

నాయకత్వము వహించుచుండెను. 1930 మార్చి 7 వ తేదీ నాయన “రాస” గ్రామము చేరెను.

అక్కడ నాయన యుపన్యాసమునకై ప్రయత్నము చేయఁబడెను. ఇంతలోనే జిల్లా మేజిస్ట్రేటు ఆజ్ఞ రంపఁజేయఁబడెను. అందులో నాయన యెట్టి సభలలోను, సమావేశములలోను బాల్గొనఁగూడదని తెలియఁజేయఁబడెను. ఈ స్వాతంత్ర్య యోధుఁడా పరప్రభుత్వాజ్ఞను బాటించునా? అంతచే నరెస్టు చెయ్యఁబడి మూడుమాసములు ఖైదు, నైదువందల రూపాయల జరిమానా విధింపఁబడెను. ఇదియే నాయన ప్రథమ కారాగార ప్రవేశము.

జైలులో నాయన బహుబాధలు పడవలసివచ్చెను. 15 పౌనులు తగ్గెను. జూన్ 16 వ తారీఖునఁ గటకటాలనుండి బయటఁబడెను. ఈ సమయములో సత్యాగ్రహము బహుతీవ్రముగా సాగుచుండెను. మోతీలాల్ నెహ్రూగారు అరెస్టుకాఁబడినప్పుడాయన వల్లభాయిని గాంగ్రెసుకుఁ దాత్కాలిక సభాధ్యక్షుఁడుగా నియమించెను. ఈ సమయములోనే దర్శన యుప్పు కొఠారులపై సత్యాగ్రహులు సాహసోపేతముగా దాడి చేయుచుండిరి. వేలాది స్త్రీ పురుష స్వయంసేవకులు లాఠీ చార్జీలకు గుఱియవుచుఁగూడ నద్భుతమైన శాంతిని ప్రదర్శించుచుండిరి. ఆగష్టు 1 వ తారీఖున లోకమాన్యతిలక్ వార్షికోత్సవము బొంబాయిలో నద్భుతముగా జరుపుట కూరేగింపు సాగెను. వల్లభాయి, మాలవ్యా, డాక్టర్ హార్డికర్ మొదలగు ముఖ్యనాయకులు ముందు నడచుచుండిరి. విక్టోరియా టెర్మినస్ సమీపమునకు రాఁగానే యూరేగింపు శాసనవిరుద్ధమైనదని

ప్రకటించి యాపుచేసిరి. ఆ సాయంకాలము 4 గంటలనుండి మఱుదినము 8 గంటలవఱకు నా రోడ్డుపైననే వా రుండిరి. ఆ రెండవ నాటి యుదయము వల్లభాయి మొదలగు వారి నరెష్టు చేయించి యితర జనమును బోలీసులు దారుణముగా లాటీచార్జి చేసిరి. వల్లభాయి మొదలగు ప్రముఖులకు మూడేసి మాసములు శిక్ష విధింపఁబడెను.

ఇటులా సంవత్సరములోఁ బదునొకండు నెలలలో మూడుమాఱు లరెస్టు చేయఁబడినాఁడు.

ఇండియాచట్టము మూడవ రెగ్యులేషను ప్రకారము 1932, 34 సంవత్సరాలలోఁ గారాగారశిక్షల ననుభవించినాఁడు.

1940 నవంబరులో వ్యక్తిసత్యాగ్రహములో నరెష్టు చేయఁబడెను. ఆయనయు కె. యం. మున్షి ప్రభృతులు యర్వాడ జైలులోనే యుండిరి. ఆ జైలులో నవ్వించుచుఁ దన బాల్య జీవితములోని మధుర ఘట్టములన్నిటిని దెలియఁ జేయుచు నాహార పానీయములలో సందఱ నాలనపాలనలు చేయుచుండు వాఁడని మున్షి పేర్కొన్నాఁడు.

1941లో మున్షి జబ్బుపడ్డప్పుడు తల్లిప్రేమతో నాయ నను సాకినాఁడు.

సాధారణలోక మాయనను గర్కశునిగాఁ దలఁచును. కాని సన్నిహితులైన వా రాయనలోఁ గన్నతల్లి ప్రేమ కలదని చెప్పుదురు. "నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణాఖండలశస్త్రతుల్య" మన్న భారతకర్తమాట సర్దారునకుఁ జెల్లుబడియగును. వేయేల? సర్దార్‌జీని గుఱించి, గాంధిజీ మాటలు గమనింపఁదగినవి.

"ఈయన నాయందుఁ జూపు ప్రేమ మా తల్లిగారు నా పట్లఁ జూపిన వాత్సల్యమును జ్ఞాపకము చేయుచున్నది. మాతృదేవత కుండు లక్షణము లీయనకున్నట్లింతకుముందు నే నెఱుఁగను."

1942 ఆగష్టు 9 వ తారీఖున క్విట్ ఇండియా తీర్మాన కారణముగా వర్కింగుకమిటీ మెంబర్లతో పాటు డిటెన్యూగా దీసికొని పోఁబడెను.

ఆ వర్కింగుకమిటీ మెంబరులనుగుఱించి, వారి కార్య కలాపములనుగుఱించి, పట్టాభిగారు చెప్పినమాటలు గమనింపఁ దగినవి.

"మౌలానా ఆజాద్ ప్రధానపురుషుఁడు.
వల్లభాయి—యందఱికంటె వివేకము గలవాఁడు.
జవహార్‌లాలు—చుఱుకైనవాఁడు.
అసఫ్ఆలీ—యాలోచన గలవాఁడు.
సైయ్యద్ అహమ్మద్—నెమ్మదియైనవాఁడు.
పండిత్ పంత్—నిశితమైనవాఁడు.
డాక్టర్ ఘోష్—శాస్త్రదృష్టికలవాఁడు.
శంకరరావ్ దేవ్—సేవాశీలములు గలవాఁడు.
కృపలానీ—అధికారముగలవాఁడు.
నరేంద్రదేవ్—విద్యాశక్తిగలవాఁడు.
హరికృష్ణమెహతాబ్—కళాసంపత్తికలవాఁడు."

పట్టాభిగారు—ఏమి వ్రాసికొనకపోయినను నన్నియుఁ దెలిసినవాఁడని మన మనవచ్చును.

భారతదేశమునకు వన్నె దెచ్చిన వీరులలో నేయొక రొకచోటం జేరినను నస్మృతమైన వెలుంగు నందీయంగలరు. అట్టి వీరందరు నొకచోటంగలసి కాలము గడుపుచుండగా నెంతటి జ్యోతి కాంతు లీనుచుండునో!

అహమ్మద్‌నగరు కోటతలుపులు త్రోసికొని లోపలికిం బోంగానే కుడిప్రక్క గదులలో వరుసగా వీరి కాపురములు- మొదటిగది సర్దార్‌జీది. కారాగృహములో నున్నను బయట నున్నను నాయన ప్రధానస్థాన మాయనకుం దప్పదు. రెండవది రాష్ట్రపతి ఆజాదుది. తరువాత ఆసఫ్‌ఆలీది. అనంతరము నెహ్రూపండితునిది. డాక్టర్ సయ్యద్‌అహమ్మద్‌జీ యక్కడ నుండంగా వీరిగదిలోనే యుండువాండు. అయిదవగది గోవింద వల్లభపంతుది. ఆఱు శంకరరావ్ దేవ్. ఏడవది డాక్టర్ ఘోష్, ఎనిమిది పట్టాభి. తొమ్మిది కృపలానీ, పది ఆచార్య నరేంద్ర దేవ్, పదునొకండవది హరికృష్ణ మెహతాబ్ - తరువాత వంటగది.

ఈ గదుల కెదురుగానుండు వరుసలో జైలు అధికారు లుందురు. వర్కింగుకమిటీ సభ్యుల సౌకర్యములు చూచుటకొఱకు యఱ్ఱవాడ జైలునుండి తెచ్చిన 13 మంది ఖైదీలుకూడ నక్కడ నుండిరి.

కోట మొత్తముమీంద నొక్కటన నొక్కటే వృక్షమున్నది. అది సర్దార్‌జీ గది ముందున్నది. ఆయనతో నేమి పోలికలు పోల్చికొందమనియో, మఱి! లేకపోయిన సర్దార్‌జీ హాస్యమునకు నవ్వుకొనుచు నాయనకుం జల్లగాలి విసరుచు నుండుటకొఱకుం గాబోలు!

ఆ వృద్ధపితను వెన్నంటి కాచి సర్వ సపర్యలు చేయు తనయ లేసి లోప మా తరు పీవిశమముగాఁ దీర్చుచున్నది గాఁధోలు.

పటేల్‌జీ హాస్యమునకుఁ బేరుపొందినవాఁడు. వట్టి హాస్యమేకాదు. ఆ చక్కలిగింతలోఁ జులుకుపోటులుకూడ నుండును.

ఆచార్య కృపలానీకూడ హాస్యరసపు జల్లులు కురి పించునుగాని దానిలో సున్నితము శూన్యము. శూలములవలె నుండును. ఆయన పలుకులు ములుకులు. ఆ పలుకులలో నాయన ప్రత్యేకతఁ బొందినాఁడు.

నెహ్రూజీ తోటమాలిగా నెక్కువ కాలము గడుపుచు నెంతో యానందము పొందుచుండువాఁడు. ఆ రసజ్ఞుఁడు జై లధికారుల నడుగకుండ సొంతసొమ్ముతో రకరకాల పూలవిత్త నములు తెప్పించి కోటయావరణాలో సగముభాగము నయనా నందకరముగా, నందనోద్యానవనముగా, మార్చివేసినాఁడు. మడులు త్రవ్వుట, కుదురులుచేయుట మొదలగు కుతూహాలపుఁ బనులన్నియు స్వయముగాఁ బ్రతిరోజు చేయుచుండువాఁడు.

నెహ్రూజీ గ్రంథావలోకనములోను, గ్రంథరచనలోను గాలము గడిపిన సంగతి సర్వజనవిదితము.

ఆమహామహుఁడు కారాగృహవాసము చేయకపోయినఁ బ్రపంచమున కమూల్యమైన యీ సాహిత్యము నిచ్చుట కవ కాశముండునా? మేలుకీళ్లు కలసియుండునుగదా!

పూర్వము తిలక్‌గారుకూడ మాండలే చెఱసాలలో గీతారహస్యమును రచించినాఁడు. మన పట్టాభిగారుకూడ

ననేక గ్రంథములు జైలులోనే వ్రాసినాఁడు. అజాద్ కూడ కురానుపై గొప్పవ్యాఖ్యానము జైలులోనే వ్రాసినాఁడు.

మన యాంధ్రదేశములోఁగూడ మాలపల్లి మున్నగు మహత్తర గ్రంథాలు కారాగృహములోనే రచింపఁబడినవి. నవ్యసాహిత్య మెంతో కటకటాలనుండియే బయలుదేరినది.

కార్యశూరుఁడని ప్రఖ్యాతిగాంచిన మన పటేలు లోగడ నెప్పుడును పుస్తకము పట్టువాఁడుకాఁడు. కాని యీ పర్యాయము చాల తీవ్రముగా గ్రంథపఠన చేసినాఁడు. సాహిత్యము, వేదాంతము, రాజకీయములు, ఆర్థికశాస్త్రము, వ్యాపారము మొదలగువానికిఁ జెందిన గ్రంథములను 300 వఱకుఁ బఠించెను. వెల్సు, బెర్నార్డుషా, టాగూర్, రస్సెల్, కారల్ మార్క్సు, ఏంజిల్ ప్రభృతుల గ్రంథములన్నిటిని గాలించినాఁడు. అన్నిటి కంటె నిదొక గొప్ప విశేషము.

ఇట్లే పెక్కు విధములఁ దమ కాలము నానందముగాఁ గ్రంథావలోకనముతో గడపిన మన ప్రముఖులు మూఁడు సంవత్సరముల యనంతరము 1945 జూన్, 15 వ తేదీన మన మధ్యకు వచ్చిరి.

## సర్దార్‌జీ జన్మదినోత్సవములు

సర్దార్ పటేలు కాడంబరములన్నను నట్టహాసములన్నను గిట్టవు. అందుచే నంతకుముందుఁ బటేలు జన్మదినోత్సవములు చాలవఱకు నిరాడంబరముగానే జరిగినవి. కాని 70, 74 వ జన్మదినోత్సవములుమాత్రము భారతప్రజ తమ 'కర్మవీరుని' యం

ధచంచలభక్తి విశ్వాసములు చూపెట్టుటకా యన్నట్టు లత్యంత వైభవముగా జరిగినవి.

70 వ జన్మదినోత్సవము 1945 అక్టోబరు 31 వ తేదీన బొంబాయి కాంగ్రెసు ఆధ్వర్యవమున బొంబాయినగరములో జరిగినవి. ఆచార్య కృపలానీ యధ్యక్షతను జరిగిన మహాసభలో స్లిప్పులో జేనేతలో దయారుచేసిన సన్మానపత్రమును, 1600 తులాల తూకముగల వెండికాస్కెట్ లో(దానిపై గాంధీజీ పటేల్ చిత్రములు చెక్కఁబడియున్నవి) నుంచి 7101 రూపాయలు రొక్కమునిచ్చి పటేల్ ను సన్మానించినారు.

సర్దార్ జీ 74 వ జన్మదినోత్సవముకూడ 1948 అక్టోబరు 31 తేదీన దేశమంతట జరిగినది. ముఖ్యముగా బొంబాయిలో ఎస్. కె. పాటిల్ అధ్యక్షతను జరిగినదే యన్నటికన్నఁ గొని యాడఁదగినది. ఆ సందర్భములో ఎస్. కె. పాటిల్ బొంబాయి ప్రజలతరఫున 731 తులాల తూకముగల బంగారముతోఁ దయారు చేయఁబడిన యశోకస్థూపమును సర్దార్ జీకి బహూకరించినాఁడు. అహమ్మదాబాదు మిల్లుయజమానుల సంఘము వారు 73 వేలరూపాయలు, స్వర్ణరాజదండము, గాంధీజీ రజత ప్రతిమను బహూకరించిరి.

స్వయముగా ననేకులు మిత్రులు వచ్చి యభినందించినారు. ఆయన నభినందించుటకై యరుదెంచిన స్వగ్రామవాసులతో మాట్లాడుచుఁ బటేలిట్లన్నాఁడు.

"స్వదేశమే నా స్వగృహము.
ప్రజలే నా బంధుకోటి.
స్వాతంత్ర్యసాధనమే నా జీవితలక్ష్యము.

"ఈ వయస్సులో నాత్మీయులమధ్య నుండవలయునని యెవరు కోరరు ? కాని నే నీ యైహికవాత్సల్యబంధములను నేనాఁడో వదలుకొని, జాతీయస్వాతంత్ర్యసాధనాంబుధిలో మునిఁగితిని. దేశము దాస్యశృంఖలాబద్ధమై యున్నంతకాలము నేను జన్మించిన చిన్నగ్రామమునుగుఱించి నే నెట్లు గర్వింపఁ గలను ? ఈ నగ్నసత్యము తెలిసినచ్చిననాటినుండి నా విశాల గృహ (భారతదేశ) స్వేచ్ఛకై పోరాడుచునే యున్నాను. జాతీయ స్వాతంత్ర్యమునకై నేను సాగించుచున్న సమరములో నాకు మార్గదర్శకుఁడుగా నుండి నాజీవితధర్మము (స్వరాజ్యము) త్వరలో ఫలప్రదమగునట్లు చేయవలసిన దని పరమాత్ముని ప్రార్థించుచున్నాను.

"దగ్గర బంధువులతోఁ గలసియుండవలయునని యెవరు కోరరు ? తన జన్మస్థానమును జూచిరావలెనని యెవరి కుండదు? కాని స్వగృహముపట్ల నా ప్రేమ, దేశముపట్ల ప్రేమాతిశయముగాఁ బరిణమించినదని మీకుఁ దెలియును. ఎప్పుడు కీలెఱిగి వాతపెట్టవలయుననియే నా కార్యాచరణమార్గము. నా జీవితకాలములో లక్ష్యసిద్ధిని జూడవలయునని కోరు చున్నాను. నా మాతృదేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును బొందిననాఁడే నేను నా గ్రామములోఁ బుట్టిన ఋణమును దీర్చుకొనఁగలను.

"నేను 73 సంవత్సరములను బూర్తి చేసికొను చున్నాను. ఇంక మఱికొంతకాలము జీవించవలెనని యాశించు చున్నాను. గాంధీజీ తనకుఁ దాను నియమించుకొన్న 125

సంవత్సరములనుదాటి బ్రతుకుట నా యభిమతముకాదు. స్వర్గములో గాంధీజీ సహచరులలో నుండఁగోరుచున్నాను."

భారతదేశము నలుమూలలనుండి వేలాది శుభసందేశములు వచ్చినవి. నాయకులుసైతము తమ 'కర్మవీరుని' స్థితప్రజ్ఞతను గొనియాడుచు దమశుభాకాంక్షలు తెలియఁజేసిరి. పటేల్ జన్మదినోత్సవ సందర్భములో సందేశ మియ్యవలసినదని బొంబాయికాంగ్రెసువారు మహాత్మగాంధిని గోరఁగా "సర్దార్ నా కొడుకువంటివాఁడు. వాఁడుకు పుట్టినరోజు పండుగనాఁ డభినందించు లాంఛనమును దండ్రి వేఱుగాఁ బాటించవలయునా" యన్నారు.

"నా అన్నగారు"

గత 25 సంవత్సరములకుఁబైగా సర్దార్ వల్లభాయి పటేల్ సన్నిహితపరిచయభాగ్యము నాకు లభించినది. కేవల మొక మార్గదర్శకుఁడేగాక, నాయకుఁడేగాక, యాయన నాకన్నగారివలె నున్నాఁడుకూడ.

ఆయనకు వయస్సుమళ్ళినది. ఆరోగ్యము చెడినది. కాని స్వాతంత్ర్యపిపాసాగ్ని యీషణ్మాత్రమైనఁ జల్లారలేదు. గాంధీజీ పెద్దవాఁడైపోయినాఁడని తానుగూడఁ బెద్దవాఁడనై పోవుచున్నానని, జాతీయాభ్యుదయభారమును యువకులుపంచుకోవలయునని యాయన యొకపర్యాయము యువకులకుఁ జెప్పుచుండఁగా విన్నాను. గాంధీజీయుఁ దానును సజీవులైయుండఁగానే తమ జాతీయాభ్యుదయ కృషిఫలితమును జూడఁగల్గుటకై యువకులు సర్వశక్తుల నశేషత్యాగములను జాతీయస్వాతంత్ర్యమునకై

భారతదేశ మనలసినదని యాయన చెప్పుచున్నప్పుడాయన కంఠ స్వరములో గాద్గద్యము కల్పించినది. ఆయన యిట్లన్నాడు గదా యని యాయనశక్తి యుడిగిపోయినదని భావించరాదు. ఈనాటికిని జాతీయాభ్యుదయ కార్యనిర్వహణలో నెంతటి భారమును మోయుటకైన నాయన సంసిద్ధుడే. ఆరోగ్యము, మేధస్సు దన ప్రాణముకన్న ప్రమాదమునకు లోనుగాగల యవకాశ మున్నప్పటికి నాయన వెనుదీయడు. ఇట్టి నాయకుని యావశ్యకత భారతదేశమున కెంతయిన నున్నది. తన శ్రమ ఫలించిన మహాపర్వదినోత్సవము చూచుటకై యాయన సజీవుడుగా నుండవలయునని భగవంతుని బ్రార్థించుచున్నా" నని సందేశమంపినాడు డాక్టరు రాజేంద్రప్రసాద్.

## "అనుపమ కార్యదక్షుడు"

"ఇప్పటికి 25 సంవత్సరములకు బైగా మనము సహాచరులముగా నెక్కు కష్టముల నెదుర్కొన్నాము. ఈ 25 సంవత్సరములు భారతీయుల కిందఱకుగూడ బరీక్షాకాలము. ఈ పరీక్షనుగొందరు తట్టుకొనలేకపోయిరి. మఱికొందరు యథాపూర్వము గానే యుండిపోయిరి. కొద్దిమంది, చాల కొద్దిమంది మాత్రమే కాలముతోపాటుగా బ్రతిభను బెంపొందింపజేసికొని, భారత జాతీయ చరిత్రలో బ్రముఖసంఘటనలుగా నిలచిపోయిన ఘట్టములపై దమ ప్రతిభ నచ్చొత్తగలిగినారు. ఈ కొద్దిమందిలో సర్దార్ వల్లభాయిపటేలు లొకడు.

"దృఢనిశ్చయము—కార్యదీక్ష— నిర్మాణ చాకచక్యము—జాతీయ స్వాతంత్ర్యమునకై పరిపూర్ణపిపాస—సర్దార్ జీవిత

విశిష్ట లక్షణములు. ఆయనతోపాటు ముందడుగు వేయ లేకపోయిన కారణమున కొంద రాయనను నిరసించిరి. కాని యసంఖ్యాక ప్రజాసీకము సర్దారులోఁ దమకు నచ్చిన నాయకునిఁ జూచినది. ఆయనతోఁగలసి యాయన నాయకత్వమునఁ బని చేసి భారతస్వాతంత్ర్యసాధనకు స్థిరమైన పునాదిని వేసినది.

"సర్దార్ దుర్భేద్యమైన కోటవంటివాఁడు. ఆయన సలహాను విశ్వసించవచ్చునని యాయనతోఁగలసి పనిచేయు భాగ్యము లభించినవారు గుర్తించియుందురు. ఆయనమైత్రి నత్యధికగౌరవముగా భావించియుందును.

"భారత జాతీయోద్యమ మాయన సేవానిరతిలో నింకెంతో కాలముపాటు లాభముపొందఁగలదని యాయన నాయకత్వభాగ్యమును బొందుచునే యుండఁగలదని విశ్వసించుచున్నాను. ఆయన జన్మదినోత్సవ శుభసమయములో నివే నా జోహారు"లని భారతప్రధాని పండిట్ నెహ్రూ జోహారు లర్పించినారు.

## "దైవభీతి కలవాఁడు"

26 సంవత్సరముల క్రితము మద్రాసులో నాతో మాట్లాడుచు వల్లభాయిపేరును గాంధీజీ యుచ్చరించిన క్షణము నాకుఁ జిరస్మరణీయము. ఆయనను గలసికోవలయునని, యాయనతోఁగలసి పనిచేయవలయునని యొక తీవ్రాకాంక్ష నాలో బయలుదేరినది. నాటినుండి నేటివఱకు నుభయులము గలసి పని చేసితిమి. ఆయన నర్థముచేసికొంటినని చెప్పఁగలను. సర్దార్తో

నెప్పట కష్ట మనుకొనువారిది పొరపాటు. ఆయనలో ప్రేమ మూర్తియైన స్త్రీవాత్సల్యము మూర్తీభవించినది. చూపులకుఁ గర్కశుఁడు. కాని లోపలనున్నది దయావేశపూరితహృదయము, శ్రమనెఱుఁగని కార్యదీక్ష.

ఆయన యుద్ధండుఁడు — నియంతవలెఁగాక, తల్లివలె. ప్రపంచములో నాయన యనుభవించిన సుఖముఁ స్వల్పము. తనను గుఱించిన యాలోచనయే యాయనకు లేదు. అన్యాయము నేమాత్రము సహించఁడు. కనుకనే యాయన నన్యాయము చేయఁజూచువారి కాయన ముక్కోపిగాఁగనుపించును. అది క్రోధముకాదు—ఆత్మవిశ్వాసము.

"ఆయన మంత్రములు చదువఁడు కాని, దైవభీతి కలవాఁడు. పెక్కుమఁదికంటె శిష్టాచార సంపన్నుఁ" డన్నారు రాజాజీ.

## "భారత సర్దార్"

"జైలునుంచి బయటికి రాఁగానే 'బార్డోలి సర్దార్'ను 'భారత సర్దార్' అని నేను సంబోధించితిని. క్షణికావేశములో నే నట్లనియుండలేదు. నాలుగు సంవత్సరములపాటు నేను దీర్ఘముగాఁ జేసిన యాలోచన ఫలితమది.

1942 ఏప్రియల్ 27 వ తేదిని అలహాబాదులో జరిగిన వర్కింగుకమిటీ సమావేశములో రాజేంద్రబాబుతో, ఆచార్య కృపలానితోఁగలిసి యాయన ప్రకటించిన వైఖరిని తరువాత నే నెన్నో పర్యాయములు సంస్మరించితిని. "క్విట్ ఇండియా"యని గాంధీజీ సిద్ధపఱచిన ముసాయిదా తీర్మాన

మూ సభలోనే చర్చించఁబడినది. ఆ సభలో నాయన పలికిన యీ పలుకు లీ నాటికిని నా చెవిలోఁ బ్రతిధ్వనించుచున్నవి.

“యుద్ధారంభకాలమునుండి కలసి ముందుపోవుటకే మనము ప్రయత్నించితిమి. కాని యీసారి యది సాధ్యపడకపోవచ్చును. గాంధీజీ యొక నిర్దిష్టవైఖరి నవలంబించినాఁడు. నేను గాంధీజీ వశంవదుఁడను. అనేక విషమస్థితులలో నాయన మనకిచ్చిన నాయకత్వము సమంజసమని ఋజువైనది. నేఁడుకూడ నాయన వైఖరి యత్యంతము సమంజసమైనదని నా యభిప్రాయము. ప్రభుత్వముతో రాజీమార్గములకై పెక్కు-పర్యాయములు ప్రయత్నించి నిరాశనే పొందితిమి. ఇక నీ రాజీబేరపువ్యవహారము కట్టిపెట్టవలయును. ముసాయిదా తీర్మానమును నేను బూర్తిగా నంగీకరించుచున్నాను.”

గాంధీజీ తీర్మానము గురించి బ్రిటిషువారు, అమెరికనులు, నేవిధముగా నభిప్రాయపడుదురని సర్దారొక్క-క్షణమైనఁ దటపటాయించలేదు. గాంధీజీ తీర్మానము ఫలితముగాఁ బ్రపంచములో బ్రిటిషుప్రభుత్వప్రతిపత్తి దెబ్బతినఁగలదని యాయనకుఁ దెలియకపోలేదు గాని, యాయన చలించలేదు. హిమాద్రివలెఁ బట్టుఁబట్టినాఁడు. జాల్పైగురీ, త్రిపురీసభలలోఁ బ్రారంభమైన కార్యక్రమమును బొంబాయిలో నంతిమస్వరూపమునకుఁ దెచ్చెను. తరువాత జరిగినది భారతదేశ స్వాతంత్ర్య చరిత్రలో నమరఘట్టము. చూచీ చూడనట్టుగాఁగాని యేదో జరుగునని కార్యశూన్యత్వముతోఁగాని యుండుట గత 25 సంవత్సరములలో సర్దార్ తత్త్వము కానేకాదు. భారతజాతీయ స్వాతంత్ర్యోద్యమమునకుఁ దక్షిణస్వార్థలాభమునకు మధ్యఁ

ఎక్కడని ఆయన యేనాఁడుకూడఁ దర్జనభర్జన పడలేదు. తాత్కాలికపు ఏర్పాటులద్వారా ప్రజాస్వామిక స్వాతంత్ర్యము సిద్ధింపఁగలదని కొందఱు తక్కినతరగతివారభిప్రాయపడుచున్న కాలములో "క్విట్ ఇండియా" తీర్మానమును దృష్టిలోనుంచుకొని 1945 జూన్ 30 వ తేదీన సర్దారిట్లు సింహగర్జన చేసినాఁడు.

"ఆ తీర్మానములో నొక్క యక్షరమును మార్చుటకు వీలులేదు. సంభాషించుటకు వీలులేదు. దాని తరువాత నొక నొట్టనుచు నుండెడి నది "క్విట్ ఆసియా."

కర్మవీరుని వాక్కులవి. భారత జాతీయ కాంగ్రెసు భావ్యభవిష్యత్తుని గర్జన యది. బార్డోలీలో, గుజరాత్ లో, చారిత్రకప్రసిద్ధోద్యమములను నడిపి, తిరిగి చరిత్రలోఁ బ్రధాన ఘట్టమును రచింపఁగల స్పష్టాభిభాషణ మది.

సర్దా రెప్పుడుకూడఁ గర్మవీరుఁడు. వాగాడంబరుఁడు కాఁడు. ఆయన సృజించినది రెండే మాటలు—"క్విట్ ఆసియా" ఆ రెండు మాటలలోనే సర్దార్ పరిపూర్ణముగాఁ బ్రతిబింబించు చున్నాఁడు. భారత దేశమునకు, నాసియాకు నదే యాదేశము. నాయకుని యాదేశమైనది. స్వాతంత్ర్యవీరుల పురోగమనము ప్రారంభమైనది. జైహింద్! జై ఆసియా!" అని కర్మవీరుని ధీరతను చాటినారు శరత్ చంద్రబోసు.

## "మన పెద్ద రైతు"

బార్డోలీ కర్షకలోకము తమ నాయకుఁడైన వల్లభాయిని "సర్దార్ పటేల్" అని సంబోధించి గౌరవించిన పర్వదినమునాఁ డాధునిక భారతకర్షకలోకములో నంతర్లీనమైయున్న విప్లవ

శక్తికి గౌరవనీరాజనము సమర్పింపఁబడినది. ఇది—1928లో. ఆ శుభవార్త రాఁగానే నే నెంతయానందించితినో మాటలలోఁ జెప్పలేను. ఆనాఁడు సర్దారుగారు నాపాలి కొక కర్షక మాత్రుఁడు. కాని యాధునిక కర్షకలోకమునకుండు నొక యఖండప్రతిభావిలసితనాయకుని. దేశ రాజకీయరంగము లోనికిఁ బంపఁగలదని, యా నాయకుఁడు బ్రిటిషుప్రభుత్వముతో ముఖాముఖిని బలాబలాలు చూడఁగలఁడని, విజయసిద్ధి నందఁగలఁడని సర్దార్‌జీ ఋజువు చేసినాఁడు. కిసాన్ సర్దార్ నాగురుపీఠ మని భావించితిని. సర్దారు సామ్రాజ్యవాది వ్యతిరేకానుభావనమూర్తిగాఁ బ్రతి భారతీయ విప్లవకారునికిఁ గన్పించును. కిసాన్ విప్లవకారులలో నాయన మేటి. ఏవో స్వల్పప్రయోజనముల నిమిత్తము గాక, స్వార్థకాంక్షాసిద్ధి నాశించి కాక, ప్రజాబాహుళ్యసౌభాగ్యసిద్ధికై యధికారమును వాంఛించు కిసాన్ మనస్తత్త్వమును సర్దార్ తనలో మూర్తీభవింపఁ జేసుకోఁగలిగినాఁడు. వివిధ కాంగ్రెసు రాష్ట్రములలోను జరిగిన రైతుఋణబాధనివారణపు చట్టాలలో నాయన యాకాంక్ష ప్రతిబింబితమైనది. ప్రజాబాహుళ్యమును సేవించఁగోరు తనమార్గమునకు ధనికవర్గము లడ్డువచ్చుట జరుగఁగా భయరహితముగా వారి నెదిరించినాఁడు. కిసాన్ విప్లవకారులలో నాదిపురుషుఁడని మన మాయనను బ్రస్తుతించుచున్నా"మని ప్రశంసించినాఁ డాచార్యరంగా.

'గాంధీజీ వశంవదుఁడు'

"సర్దారు కాయన జన్మదినోత్సవ సందర్భములో నా హృదయపూర్వకాభినందనములు. ఆయన పరిచయభాగ్యము

నాకు లభించినది. ఆధ్యాత్మికముగా నాయన గాంధీజీకి వశం వదుఁడు. నిర్మాణప్రతిభ యాయనలో మూర్తీభవించినది. భారతజాతీయోద్యమకృషిలో నత్యంతప్రధానపాత్రను నిర్వహించినాఁడు. భారత స్వాతంత్ర్యసమరములో సతిరథుఁ" డన్న రాష్ట్రమంత్రి కె. యం. మున్షీ.

"మనసు బాగుగా లేనిపోయిన దివ్యౌషధము పటేల్"

"సర్దార్ పటేల్ పరిచయ మొక మేటి భాగ్యము. మిత్రులకు వజ్రకవచుఁడు. మనస్సు నవనీతము. నిష్కపటి! మంచి చతురుఁడు! సంభాషణలో దిట్ట. బాపూజీకి (గాంధీజీకి) కొంచెము మనస్సు బాగుగా లేకపోయినప్పు డౌషధము — సర్దార్‌తో భేటీ!

జన్మతః ప్రజానాయకుఁడు. దరిద్ర ప్రజలలో నొకఁడ నని భావించు నుదాత్తచిత్తుఁడు!

"ఆయన సాహసము, నాయన పట్టుదల, యాయన చిత్తశుద్ధి, యాయన త్యాగనిరతి, యాయనవలె జీవించుటయే యాయనను గౌరవించుట కుత్తమమార్గ" మని ప్రస్తుతించినది రాజకుమారి అమృతకౌర్.

డాక్టర్ పట్టాభి :—

"సర్దార్‌జీ! మీకు నా యభివందనములు. నేడు డెబ్బదవ సంవత్సరము పూర్తిచేసికొని హస్తసాముద్రిక ప్రోక్తజీవితమును బూర్తిచేసినారు. ఉపనిషత్తులు చెప్పు పూర్ణాయుస్సుకు (116 సంవత్సరములు) నింకను 46 యేండ్లు మీరు గడుపవలయును.

సంపూర్ణారోగ్యముతో దేశసేవానిరతులై యుండు దానిని బహుసేవ చేయఁ గలుగుదురుగాక!

పండిట్ పంత్ :—

"సర్దార్ పట్ల నా కశేషభక్తి. ఆయన యన్నచో నా కమితగౌరవము. ఆయన ధైర్యసాహసములకు, దృఢసంకల్పమునకు నమోవాకములు. స్వార్థరహిత జాతీయసేవకుఁడు."

యూసఫ్ మెహరాలీ:—

ఆధునిక భారతదేశచరిత్రలో రాఁగల ప్రముఖులలో సర్దా రొకఁడు. దాదాభాయి, ఫిరోజిషా, గోఖలే, తిలక్, మహమ్మదాలీ, చిత్తరంజన్ దాస్, అన్సారీలతోఁ దులతూఁగు కర్మవీరుఁడు.

"కాని యాయన గొప్పతనము అనేకవిధమైనది. నిర్మాణశాలిగా నసమాన్యప్రతిభయే యాయనలోని విశిష్ట లక్షణము.

"మాటలోఁ జేతలో నిష్కపటి. నిష్కపట తత్త్వముగలవాఁడని యాయన పేరు మన రాజకీయపదజాలములోనికి ప్రవేశించినది."

యస్. కే. పాటిల్ :—

"నిర్దుష్టమై, విశిష్టమైనవిధముగాఁ దక్షణమే నిర్ణయించ గల భారత రాజకీయవేత్త యెవరని యడిగిన నొక్క క్షణమైన నాలోచించకుండ నేను సర్దార్ పటేలని యందును.

"ప్రపంచ జ్ఞానములో నితరులకుఁ బైచేయి, నిష్కపటి, కర్మవీరుఁడు."

# రాజకీయ సమీక్ష *

"ఇండియాసమస్య లన్నింటికి బొంబాయి కీలకము. బొంబాయిమార్గదర్శకమైన సిండియాలోని తక్కిన ప్రాంతములు దాని ననుసరించవచ్చును. నాపట్లఁ బ్రదర్శించిన ప్రేమాభిమానములకు బొంబాయి ప్రజలందరకు నా కృతజ్ఞతను దెల్పుచున్నాను. మీ యాదరమునకు ప్రేమాభిమానములకు నే నర్హుడ నను విషయము నిరూపించుకొందును. నేనికఁ గార్యరంగమునుండి నిష్క్రమించి, విశ్రాంతిగైకొనవలసినవయస్సులో నున్నాను. కాని జీవితశేషమునుగూడ దేశసేవకే యంకితము చేయవలయునని నా హృదయ మువ్విళ్ళూరుచున్నది. సుస్థిరమైన, బలవత్తరమైన, భాగ్యవంతమైన దేశముగా సిండియా నభివృద్ధిపఱచి, యెవ్విధమైన ప్రమాదము వాటిల్లకుండ దానికి రక్షణ కల్పించవలయునని హృదయపూర్వకమైన నాయాకాంక్ష. ఈ పవిత్ర కార్యసాధనకై నా జీవితశేషము నంకితమిత్తును.

## దేశవిభజన

"గత సంవత్సర మిండియా యెట్టి పరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చినదో మీకుఁ దెలియును. పెక్కు క్లిష్ట సమస్యలను మన మెదుర్కొనవలసి వచ్చినది. కొన్నికొన్ని సమయములలో రేయింబవళ్లు మన మాతురతతో, భయసందేహములతోఁ గృషి

---

*సర్దార్ పటేల్ తన 74 వ జన్మదినోత్సవసందర్భములో బొంబాయి చౌపాతీలో జరిగిన బహిరంగసభలో నిచ్చిన యుపన్యాస సారాంశము. అంత మహాసభ యెప్పుడును జరుగలేదు.

కోలుపవలసివచ్చినది. ఎక్కడఁ గాలుజారి తప్పటడుగు వేయుదుమో, యందువల్ల దేశమున కేమి కీడుమూడునో యను స్థితిలో, గాఢాంధకారములో, మన మిరువురము కృషి చేయుచు వచ్చితిమి. ఈ గండములన్ని గడచి మనము గెలుపొందుట సాధ్యమని తలపోసినవారు, విశ్వసించినవారు కూడఁ ఎక్కుమంది యున్నారు. ఒకవిధముగాఁ జెప్పవలయునన్న దేశవిభజనకు నేను చాల నయిష్టముగా నంగీకరించితిని. దుఃఖభారముతో నా హృదయము క్రుంగిపోయినది.

"అంతరాంతరములయందలి నా మనఃప్రవృత్తులకది విరుద్ధము. మన జీవితలక్ష్యమునకు మన యాదర్శముల కది పూర్తిగా విరుద్ధము. కాని మఱియొకవిధముగాఁ జూచిన నైచ్ఛికముగానే మనము దేశవిభజన కంగీకరించితిమి. దాని పరిణామము లెట్లుండగల వను విషయమును పూర్తిగాఁ దఱచి చూచిన పిమ్మటనే యంగీకరించితిమి. కలసి మెలసి నడువ లేక పోయినప్పుడు విడిపోవుట మంచిదని మనము నిర్ణయించుకొన్నాము. ఇతర విధముల మనకు స్వాతంత్ర్యము లభించునది కాదు. దేశవిభజనకు మన మామోదించియుండక పోయినచో బరిస్థితు లిప్పటికన్న నప్పు డెక్కువగా విషమించియుండును. ఆరోజులలో మనము పరస్పరము తగవులాడుకొనుచుఁ గాలము గడుపుచుంటిమి మన విషమపరిస్థితి నవకాశముగాఁ దీసికొని మూఁడవపక్షమువారు తమ పబ్బము గడుపుకొనుట మొదలుపెట్టిరి. అందువల్ల స్వాతంత్ర్యసిద్ధికి మనము మూల్యమును జెల్లించవలసి వచ్చినది. సాధ్యమైనంత త్వరలో విదేశీయులు వైదొలఁగినట్లయిన దానికి మూల్యముగా దేశవిభజన కంగీక

గిన వచ్చునని యప్పుడు మేము నిశ్చయించితిమి. దేశ విభజనవల్ల మనము చాలబాధలకు లోనైతిమి. శరీరములో నొక యంగమును ఖండించి వేసినట్లైనది. కాని దేశవిభజన కాపేరా దించి, ముందుసపక్షములో నేర్పడియుండు పరిస్థితులతోఁ బోల్చి చూచిన నిది చాల నయమని చెప్పవలయును.

“అందువల్ల దేశవిభజన కంగీకరించినందుకు నే నెన్నడును చింతించుటలేదు. దేశవిభజనకుఁ బూర్వమున్న విధముగానే వ్యవహరించుచు దేశవిభజన నంగీకరించకపోయిన మన మింకను బెక్కు దురవస్థలపాలై యుండువారమని ప్రభుత్వ నిర్వాహణములో నేను పొందిన యనుభవమునుబట్టి యిప్పుడిప్పుడు నేను నిర్ణయించుకొనుచున్నాను.

## ఇండియావ్యవహారములో పాకిస్థాన్ జోక్యము

“చిఱిగిన చదరవలెఁ బాకిస్థాను దమకు సిద్ధించినదని చెప్పుచు పాకిస్థాన్ నాయకులు కాపట్యముతోనే దేశవిభజన కంగీకరించిరి. వారు దుర్బుద్ధితో నున్నారని మనపట్ల నవిశ్వాసముతోనే వ్యవహరించుచున్నారని మాకుఁ దెలియును. అదే నిజమై యదను చిక్కినప్పు డిండియాపై దండెత్తవలయునని వారు తలపోసినట్లయిన నట్టి పరిస్థితి నెదుర్కొనుటకు మనము సర్వసన్నద్ధముగా నుండవలయునని మేము గ్రహించితిమి. పాకిస్థాన్ సాధన యత్నములోనే బయటివారి తోడ్పాటు వారి కున్నప్పుడు, పాకిస్థాన్ సిద్ధించిన పిమ్మటఁగూడ వారి దుష్కృత్యముల కా తోడ్పాటుండితీరునని మనకుఁ దెలియును. అందువల్ల మన దేశమును సమైక్యపఱచి సుసంఘటితముచేయుట యత్యావశ్యకమైనది.

## వజ్రసంకల్పము

"స్వాతంత్ర్యసిద్ధి పిమ్మట సార్వభౌమాధికారము అంతరించి పోవునని కొత్త డొమినియనులలోఁ జేరుటకుగాని లేక స్వతంత్రముగా విడిపోవుటకుగాని సంస్థానములకు స్వేచ్ఛయుండునని, దేశవిభజన ప్రణాళికలో నొక షరతున్నది. కాని చిన్న చిన్న సంస్థానాధిపతు లందరికి నున్నట్టుండి యొక్కపెట్టున సార్వభౌమాధికారము సంక్రమించునని తలపోసిన యమాయకుఁ డెవఁడును నుండఁడు. నిజముగా నట్టిపరిస్థితి యత్యంతప్రమాదభరితమైనది. దానికి మనమెన్నఁడు నంగీకరించువారము కాము. ఈ తరుణము లోనే పెక్కుమంది సంస్థానాధిపతులు దేశభక్తి ప్రేరితులై మనతోఁ గలసిపోవుటకు నిశ్చయించుకొన్నారు.

"విడిగా నుండిపోవుదమని భావించువారు, మనతోనే కలియక తప్పినదికాదు. చివరకు మూడుసంస్థానములుమాత్రము మిగిలిపోయినవి – జునాగఢ్, హైదారాబాద్, కాశ్మీర్ – ఈ మూడు సంస్థానములవిషయములలో జోక్యము చేసికొనుటకే పాకిస్థానుకవకాశము కలిగినది. దొంగలవలె, బందిపోటువలె, మన యాంతరంగిక వ్యవహారములోఁ గల్పించుకొనవలదని వారిని మనము హెచ్చరించితిమి. కాని మన హెచ్చరికలను వారు పెడచెవిని బెట్టిరి.

"జునాగఢ్ సంస్థానము పాకిస్థాన్‌లో జేరినట్లు, జునాగఢ్ నవాబుచేఁ బ్రవేశ నియమావళిపై సంతకము చేయించిరి. ఆ నవాబుకు వారాశ్రయమిచ్చి రక్షణ కల్పించవలసివచ్చెను. కాని పాకిస్థానులో ననుభవించు స్వాతంత్ర్యముకంటె నిండి

నైజాముఁ గారాగారవాసము సలుపుమని యాయన తలపోయు చుండఁగలఁడని నా విశ్వాసము.

"ఇదే తరుణములో వారు కాశ్మీరులో గూడ జోక్యము చేసికొన్నారు. ఆ పోరాట మింకను సాగుచునే యున్నది. కొండజాతుల ప్రాంతాలలోఁ బాకిస్థాను విషమపరిస్థితు లేర్పడినవి. పొగడ్తలవల్ల నేమి, రొమ్ము త్రిప్పినవల్ల నేమి, యీ సమస్యల బరిష్కరింపఁజూచిన పాకిస్థాను నాయకులు, చివరకు వీరిని గాశ్మీరముపై నుసిగొల్పిరి. ముస్లిము లత్యధిక సంఖ్యాకులుగాఁ గల కాశ్మీర్ సంస్థానము విధిగా బాకిస్థానులోఁ జేరిపోవలెనని కొందరభిప్రాయపడుచున్నారు. అసలు మనము కాశ్మీరులో నెందుకున్నామా యని వా రాశ్చర్యపడుచున్నారు.

"దీనికి సమాధానము చెప్పుట యతిసులభము. కాశ్మీర్ ప్రజలు మన తోడ్పాటును గోరుచున్నారు. కనుకనే మన మక్కడకు వెళ్ళితిమి.

"కాశ్మీర్ ప్రజల కిష్టము లేనిపక్షములో మనమక్కడ నొక్కక్షణముగూడ నుండఁబోము. కాశ్మీర్ యుద్ధమింకను సాగుచునేయున్నది. ఆ యుద్ధములోఁ దన కేమియు జోక్యము లేదని పాకిస్థాను ప్రభుత్వము ముందు బుకాయించినది. తమ సైనికు లక్కడఁ బోరు సల్పుచున్నమాట వాస్తవమేనని, యిప్పు డది యంగీకరించుచున్నది.

"కాశ్మీర్‌లో దాని ప్రవర్తనకుఁ బాకిస్థాను పరువుప్రతిష్ఠలు ఘంటఁ గలిసెనని చెప్పవచ్చును. కాని హైదరాబాద్ సమస్య నవకాశముగాఁ దీసికొని తన పబ్బము గడుపుకొంద

మని యిది చేసిన ప్రయత్నములకంటె గాని పేరుప్రతిష్ఠలను భంగించునది మఱొకటి లేదు.

"హైదరాబాదులోఁ బాకిస్థాను స్వప్రయోజనము లేవియు లేనప్పటికి నా రోజులలో హైద్రాబాద్ ప్రధానిగాఁ బనిచేసిన మీర్ లాయక్ ఆలీ నిజామునకుఁ బాకిస్థాన్ ప్రతినిధి. ఇతర సంస్థానములకంటె హైదరాబాద్ పట్ల మనము చాల నుదారముగాఁ బ్రవర్తించితిమి. హైదరాబాద్‌కుఁ బెక్కువిధముల ననుకూలమైన యథాస్థితి ఒడంబడికను మనము నిర్ణయించితిమి. కాని యిదే తఱుణములోఁ బాకిస్థానునకు యిరువదికోట్ల రూపాయలను ఋణమిచ్చుటకు హైదరాబాద్ ప్రభుత్వము రాయబారము చేసినది.

"అయినప్పటికిఁ దన యభీష్టానుసారము నిజాం సమస్యను బరిష్కరించుటకు లార్డు మౌంట్ బాటెన్ కవకాశమిచ్చితిమి. చివరివఱకు నాయన యాశతోనే యున్నాఁడు. హైదరాబాదుకు స్వయముగా వెళ్ళి ఒడంబడికపై నిజాముచేత సంతకము చేయించవలెననికూడ నాయన తలపోసినాఁడు. కాని యాయన యాశలు ఫలించలేదు. విఫలమనోరథుఁడై విచారముతో నాయన వెళ్ళిపోయినాఁడు.

"లార్డు మౌంట్ బాటెన్ నిష్క్రమణమునిమ్మట మనకుఁ దోఁచినవిధముగ మనము నిజాముసమస్యను బరిష్కరించుకోవలసి వచ్చినది. హైదరాబాదుకుఁ బాకిస్థాను పెక్కు విధములఁ దోడ్పడుచున్నదని మనకుఁ దెలియును.

"ఇంగ్లండులోఁగూడఁ గొందఱు మనపట్ల శత్రువైఖరి నవలంబించి, యీ వివాదములను సంతరించి మిత్రరాజ్యసమితికి ఫిర్యాదు చేయవలయునని రహస్యముగా మంత్రాంగము చేసిరి. కాశ్మీరు విషయమై రాయబారములుకూడ జరిగినవి. హైదరాబాదుకు దొంగతనముగా నాయుధముల సరఫరా జరిగినది.

## నిస్సహాయుఁడు నిజాము

"వీని కంతకు నెవరు బాధ్యులను విషయము నిప్పు డిప్పుడే తేల్చి చెప్పలేము. ఇతరుల చేతులలోఁ దాను బందీ యయిపోయితినని నవాబ్ చెప్పుచున్నాఁడు. మిత్రరాజ్యసమితిలో నీ వివాదను కొనసాగించుట తన కిష్టము లేదనియు ఫిర్యాదు నుపసంహరించుకొనుచు మిత్రరాజ్యసమితికిఁ దా నొక లేఖ వ్రాసితినని నేఁ డాయన చెప్పుచున్నాడు. నవాబ్ పేరిట స్టర్లింగ్ నిల్వలన్నిటిని నాయన ప్రతినిధులు పాకిస్థానుకు బదిలీ చేసినారు. తమ కుటుంబములను వారు పాకిస్థానుకు తరలించి వేసినారు. ఇన్ని జరిగినతర్వాతఁగూడ సుహృద్భావమని, యిరుగుపొరుగువార మని ప్రేమాభిమానములని, పాకిస్థాను ధర్మపన్నాలు చెప్పుచున్నది. అదంతయు నర్థములేని ప్రసంగము.

"ఇండియా దుర్బుద్ధితోఁ జేసిన యొక్క దుష్కృత్యము నైన వ్రేలుమడచి చూపించవలసినదని పాకిస్థాను సవాలు చేయుచున్నాను. వారట్లు చూపించిన దానికిఁ దగుసమాధానము మన మీయవచ్చును. కాని యాంతరంగిక వ్యవహారములలో దాని జోక్యమును మన మిక సహించఁజాలము. ఈ

సందర్భములో ఇండియాకాని, పాకిస్థాన్ కాని — యేమాపాటుకు వచ్చినఁ బ్రపంచమంతయు నిర్మూలమై పోయినను సరే మనము లెక్కచేయము. పాకిస్థాన్ తనగోతిని తానే త్రవ్వుకొనఁదలఁచు కొన్న, నందుకు దానికిఁ బూర్తిగా స్వేచ్ఛయున్నది.

## హైదరాబాద్ భావి

“హైదరాబాద్ సంస్థానమును భాషాప్రయుక్తముగా విభజించి సరసనున్న రాష్ట్రములలోఁ గలిపివేయవలయునని కొందరు సూచించుచున్నారు. నిజాం నవాబును గద్దె దింపవలె నని కొందరు, బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పినఁ జాలునని కొందరు సూచించుచున్నారు.

“ప్రస్తుతమునకుమట్టుకుఁ బ్రతివారు చెప్పునది విని, సమయమువచ్చినప్పు డాయా సూచనలను బరిశీలించవలసియున్నది. కాని యొకటిమాత్రము స్పష్టము. హైదరాబాదు ప్రజల ప్రయోజనముల కేది క్షేమకరమో, హైదరాబాదు ప్రజలు దేనిని వాంఛింతురో దానికే మనము పూనుకొందుము. తమ భవిష్యత్తు విషయమై నిర్ణయించుకొనవలసిన బాధ్యత నిజాం ప్రజలపై నేయున్నది. నవాబ్‌ను గద్దె దింపవలయునని కనుక ప్రజలు నిర్ణయించు పక్షములో బయటివా రెవరు నా నిర్ణయమును ద్రోసిపుచ్చజాలరు. ఇది గృహకృత్యవిషయము. దీనిలో చర్చిల్ జోక్యముచేసుకొన్నను నతని తలఁదన్నినవాడు కల్పించుకొన్నను సహించుటలేదు.

“కాశ్మీరుకు మన మెందుకు వెడలితిమని కొందరు ప్రశ్నించుచున్నారు. దీనికి సమాధానము విస్పష్టముగా కన్పిం

చుచునే యున్నది. కాశ్మీర్ ముస్లిములు మనలను వెళ్ళిపొమ్మ న్నచో మన మూలాగే వచ్చివేయుదుము. అంతేకాని కాశ్మీరీల నూరకే శత్రువులచేతికి విడిచిపెట్టి యక్కడనుండి వైదొలఁగి పోము. టోరీలుకాని, లిబరల్సుకాని, బయటివారు మరెవరైనఁ గాని, యీ విషయములో జోక్యము చేసికొనఁగూడదు. కాశ్మీర్ ప్రజాప్రయోజనములకు విరుద్ధముగా వారు చెప్పు సలహాలను వినిపించుకోఁబోము. ఇప్పటికిఁగూడ ప్రతి విషయములోను గల్పించుకోవలయునని వారు ప్రయత్నించుచున్నారు. ఇండియా నేఁడు స్వతంత్ర మయినదని వారు గ్రహించుచున్నట్లు లేదు. అది వారు గ్రహించనంతకాలము వారితోఁ గలసి మెలఁగుట మనకు సాధ్యముకాదు."

పరస్పరప్రేమాభిమానములు కలిగియుండి, యొకరిపై నొకరు తూటాలు విసరుకొనుట యసాధ్యమైన విషయము. కామన్వెల్తులోనే మన ముండిపోవలయునని వారి యాకాంక్ష. ఇండియా శ్రేయస్సుదృష్ట్యా యీ విషయమును మనము నిర్ణ యించుకొందుము.

## చర్చిల్ దుర్భ్రమ

ఇండియారక్షణ తనవల్లనే సాధ్యమగునని చర్చిల్ భావించినట్లయిన నాయన నా దుర్భ్రమలోనే యుండనిండు. ముందాయన యింగ్లండును రక్షించుకొనుట మంచిది. సత్యము, ప్రేమ, న్యాయము — ఈ యుత్తమ గుణములే నేఁడు ప్రపంచమును రక్షించఁగలిగినవి. ఇకఁ బ్రపంచము తృతీయ ప్రపంచ సంగ్రామమును భరించఁజాలదు. చర్చిలుది

వినాశాత్మక శస్త్రాస్త్రము. నేటి కల్లోల ప్రపంచమునకు గాంధీ విధానమే శాంతి సామరస్యములను సమకూర్చగలదు.

## సమైక్య, పవిత్ర భారతావని సాధనము

“దేశవిభజన జరిగిన వెంటనే యిండియా నెన్నో క్లిష్ట పరిస్థితులు గాడుముట్టుకొన్నవి. ఇండియా ప్రతిష్ఠకుఁ గళంకము కలిగినది. కాశ్మీర్ సమస్యకంటె హైదరాబాదుసమస్య చాల విషమముగాఁ బరిణమించినది. దానిమూలమున దేశములోని వాతావరణమంతయు మారిపోవుటయే దీనికిఁ గారణము. విద్వేషములు ప్రబలిపోయినవి. గాంధీజీహత్య జరిగినది. ఈ విషాద సంఘటనమూలముగా మనకుఁ గలిగిననష్ట మింతయు నంతయుఁ గాదు. ఆయన సలహాలు, మార్గదర్శకత్వము, నన్నిటికంటె మించి యాయన యాశీర్బలము మన కత్యావసరమైన తరుణములో మన మధ్యనుండి యాయన తిరోహితుఁడైనాఁడు. కాని యాయన దృష్ట్యా, ప్రపంచదృష్ట్యా నాయన నిర్యాణ మొకవిధముగా లాభదాయకమే యని చెప్పవలయును. నా మట్టుకు నే నట్టి మరణమునే కోరుచున్నాను. అయినప్పటికి నా దుష్కృత్యమునకుఁ బాల్పడ్డవారుమాత్రము పశ్చాత్తాపము చెందక తప్పదు. ఈ ప్రమాదము లన్నిటిని మనము గడచి బయటఁబడితిమి. ఈ ప్రమాదములను వీలైనంతవఱకు స్వప్రయోజనానుగుణముగా మనము వినియోగించుకొన్నాము. ఇండియాకు శాంతి సామరస్యములను జేకూర్చితిమి. గాంధీజీ నిర్యాణానంతరము దేశములోఁ గలిగిన పరిణామమువల్లనే హైద్రాబాద్ పైఁ బోలీసుచర్యల సందర్భములో శాంతిభద్రత

లకు రక్షణ కలిగినది. నేడు ప్రజలలో బలిష్ఠమగు విశ్వాసము కానవచ్చుచున్నది. పాకిస్థానికంటె ముందు మన విషయములో జోక్యము చేసుకొనఁగూడదనియే మనము వాంఛించుచున్నాము. వారు జోక్యము చేసికొనుట యనఁగా ముస్లిములలో, నాగ్ర రతి, భయసందేహములు, కలుగుట యన్నమాట. శాంతి స్థాపనకే యిఁకఁ గృషిచేయవలయునని మనము ప్రయత్నించుచున్నాము. ఇండియాను మన మేకరాజ్యము చేసితిమి. ఇక దానిని సమైక్యము, పటిష్ఠము చేయవలసియున్నవి. శాంతి భద్రతలను, సుపరిపాలనమును మనము నెలకొల్పవలయును.

"మనము సక్రమముగా వ్యవహరించకపోయినఁ జిక్కులు తప్పవు. గాంధీజీ నిర్యాణానంతరము కొల్హాపూరులో నేమి జరిగినదో చూడుఁడు. ఈ సందర్భములో నియమింపఁబడిన విచారణసంఘము దర్యాప్తుచేసి మంత్రివర్గము పెద్ద పొరపాటు చేసినదని నిర్ణయించినది. ఇతర ప్రాంతములలోఁగూడ నీలాగే జరిగిన స్వరాజ్యముకంటె బ్రిటిషు ప్రభుత్వమే నయమని ప్రజలు భావించుకొందురు.

"స్వాతంత్ర్యము సిద్ధించిన ప్రథమ సంవత్సరములో నెదుర్కొన్న ప్రమాదముల నుండియూ గడచి బయటఁబడినది.

"అసలు పని యిఁకఁ బ్రారంభము కావలసియున్నది. విదేశ పాలకులనుండి మనము ప్రభుత్వమును స్వాధీనము చేసికొంటిమి. కాని దానిని నిర్వహించు విషయమై మన మాలోచించుకొని దానికిఁ దగు నేర్పాట్లు చేయవలసియున్నది. ఈ మహాకార్యమును మనము నిర్వహించవలసియున్నది. ఊపిరి

సల్లాపుటకుఁగూడ మనకిప్పుడు తీరిక లేదు. రేయింబవళ్ళు పని చేసిననే మన కృషి శీఘ్రతరముగా సాగును. మన సరిహద్దులలో నేమి జరుగుచున్నదో చూడుడు. బర్మా, మలయా, ఇండోనీషియా, చైనాలలో నేఁడు శాంతి లేదు. మన పొరుగు రాజ్యము మనపైఁ గన్నువేసి యున్నది. చిత్తశుద్ధి, పవిత్రాంతఃకరణ లేని దేశ మిది.

“ఈ పరిస్థితులలో నీ సమస్యను బరిష్కరించుటకు నా సూచన యేమిటో బొంబాయిపౌరులకుఁ దెలియపఱచఁదలచుకొన్నాను. ఇకనుండియైన సంకుచితమైన రాష్ట్రీయవాదనకు స్వస్తిచెప్పుఁడు ఒకవేళ మీరు రాష్ట్రీయవాదము నవలంబించుచున్నను గొంచెము నిగ్రహముతో మాట్లాడుట యెంతో యవసరము. బొంబాయిసమస్య బెర్లిన్‌సమస్యవలెఁ బరిణమింపఁగలదనుట శుద్ధావివేకము. మన మందరము చిత్తము వచ్చినట్లు మాట్లాడుచు, వాతావరణమును విషకలుషితము చేసివేసినట్లయిన నిండియా సర్వనాశనమైపోవును “సిరి రా మోఁకా లడ్డుపెట్టి”నట్లగును.

బానిసలుగా నున్నప్పుడు మనకుఁ బరస్పరము గౌరవము, సాహాయ్యత యుండెడివి. పరాధీన పరిస్థితులలో మనము పరస్పరము కలసియున్నాము. ఇప్పుడు స్వతంత్రులమైనతరువాత మన మెందుకుఁ గలహించుకొనవలయును?

మన గతచరిత్ర నొక్కసారి సంస్మరించుకొనుఁడు. కేవలము పరస్పర విభేదములతో, భ్రాతృహత్యలకుఁ బితృహత్యలకుఁ బూనుకొనుటచేతనే మన సామ్రాజ్యములు పోయినవి. స్వతంత్రము వచ్చిన తర్వాత మనము కలహించుకొని, దీనిని

గొంచెము వమ్ముచేసిన, భవిష్యత్సంతతులవారు మనలను దిట్టుకొందురు. కేవలము మనలను మనమే పొగడికొనుచుఁ గూర్చొనలేము. మన కున్న సహజసంపదలపై నాధిపత్యము సంపాదించుకొనవలయును. లేకపోయిన మనముఖమునకుఁ దారిద్ర్యమే గతి కాఁగలదు.

ఇంతకు మనమందరము నేఁ డెదుర్కొనవలసిన క్లిష్ట సమస్య యేమిటి? ఇండియాలో శాంతి భద్రతల సంరక్షణ కాదా? కొంచెము కాలూని నిలుచుటకు మన కవకాశము కలిగినది. ఇప్పుడు మన పునాదులను మనము గట్టిపఱచుకో వలయును. పరస్పరప్రేమ, విశ్వాసములవల్ల మాత్రమే యిండియా యఖండమై సుదృఢముగా వర్ధిల్లఁగలదు.

ఆతరువాత మన మెదుర్కొనవలసిన మఱియొక మహా క్లిష్ట సమస్య ఇక క్షామము. మనకుఁ జాలినంతగా మనము వేసిన మన దేశములో నుత్పత్తి చేయుటలేదు. అందుకొఱకు బోలెడు సొమ్ముపోసి విదేశములనుండి దిగుమతి చేసుకోవలసి యున్నది. మనము వాని రవాణాకొఱకే యనేక కోట్ల రూపాయలు పోయవలసి వచ్చుచున్నది. మనము శాస్త్ర వివేకముతోఁ గ్రొత్త నౌకలను నిర్మించినను లేక ఖరీదు చేసినను నీ డబ్బంతయు నాదా యయ్యేడిదికాదా! మనకుఁ జాలినంత గుడ్డను మన ముత్పత్తి చేయుటలేదు. మనకుఁ దినఁదిండి, కట్ట బట్ట కావలసినంత యుండిన శాంతిగా బ్రతుకవచ్చును. తక్కిన యిబ్బందుల నేవినయినఁ దేలికగా భరించవచ్చును. ఒకవేళ మనము చాలినంత యుత్పత్తిని గొనసాగించినను దాని నందఱికుఁ బంచుటలో నెన్నో చిక్కు లేర్పడుచున్నవి. మనము

శాసనవిషయములు సుసాధ్యమైనవి. ఇవి యన్నియు మే మెదుర్కొనుచున్న కష్టములు. అందువల్ల నూతన మనోవ్యవస్థ నేర్పరచుటకుఁ గష్టమగుచున్నది. ఈ లోపములను సవరించుకొనుటకు మేము గట్టి ప్రయత్నము చేయుచున్నాము. కాని యిందుకుఁ గొంతకాలము పట్టఁగలదు.

## ద్రవ్యోల్బణమునకుఁ బరిష్కారము

మేము కంట్రోల్సును రద్దుచేసి యందువల్ల నేర్పడిన పరిస్థితులను బరిశీలించితిమి. దొంగలాభములు పొసఁగఁదలచిన వారు తమకుఁ గావలసిన ధనమును సంపాదించినారు. వీరిలోఁ గొంద రాదాయపుపన్నుగూడఁ జెల్లించలేదు. ఆదాయపు పన్ను చెల్లించవలసి వచ్చునను భయముతో వారు తాము దాఁచిపెట్టుకొన్న సంపదను బయటపెట్టుటకు సాహసించుట లేదు.

ఈలోఁగా ధరలు పెరిగిపోయినవి. కార్మికు లెక్కువ జీతము లడుగుచున్నారు. ప్రభుత్వోద్యోగులు నిదే పాట పాడుచున్నారు.

ఈ సంగతు లన్నింటి నాలోచించి, యిండోనీషియాలో, చైనాలో, మలయాలో, బర్మాలో నేమి జరుగుచున్నదో, దానితోఁ బోల్చిచూడుఁడు. ఈ దేశములగతియే మన దేశమునకుఁగూడఁ బట్టినచో మనము సాధించిన స్వరాజ్యము నిష్ఫలము కాఁగలదు.

ఈ సమస్య లన్నింటికి మన మొక పరిష్కారమార్గమును గనుగొనవలసియున్నది.

మన శక్తిసామర్థ్యములను, సంపదను, సమీకరించి దేశము నీ కష్టములనుండి గట్టెక్కించుట యెట్లో యాలోచింపవలయును. కార్మికులు, కర్షకులు, ధనికులు, నందరు నిప్పటివలెనే పరిస్థితులు లీలాగే యుండినట్టయిన నిండియా సర్వనాశనము కాకతప్పదను సంగతిని గుర్తింపవలసియున్నది. ఇండియా యిప్పుడు శత్రువుల నెదుర్కొనుచున్నది.

ఇండియాకు స్వాతంత్ర్యము వచ్చినప్పుడు సేనలసంఖ్య తగ్గించి వెయ్యవచ్చునని భావించితిమి. కాని నిజమున కా సంఖ్యను పెంచవలసియున్నది. బలమైన కేంద్రప్రభుత్వము, బలమైన సైన్యము నిండియా కెంతో యవసరము. హైదరాబాదులో నా సంస్థాన ప్రధాని, మఱియొక విప్లవకారుడని చెప్పుకొను వ్యక్తి కలసి ప్రారంభించిన యలజడులను మన మణచివేసితిమి. ఇందుల కేది కారణమో, మనము దానిని గ్రహించవలసియున్నది.

మనకుఁ బ్రతిపక్ష ముండవలయునని ప్రజ లనుచున్నారు. అయితే ప్రతిపక్ష ముండుట కిది తరుణముకాదని, సహకార మత్యవసరమని నేను సవినయముగా మనవి చేయుచున్నాను. ప్రస్తుత మిండియా సుదృఢమై యాసియా దేశములకు సహజముగా నాయకత్వము వహించవలసియున్నది. ఆ పరిస్థితి యేర్పడిన తరువాతనే మనము పరస్పరము వివాదపడుట కవకాశ మున్నది. మీరు నా సలహాను వినకపోయిన నిండియా సర్వనాశనము కాకతప్పదన్నట్లు కనబడుచున్నది.

## లాభములు పోసికొనుటకు సమయముకాదు

ఈ సమస్యలను బరిష్కరించుటలో బొంబాయినగర మెట్లు తోడ్పడఁగలదో, వివరించుచు సర్దార్ పటేలిట్లు లన్నారు.

"ఇండియాలోఁ గీలకమైన ప్రదేశములో బొంబాయి నగర మున్నది. మన యార్థిక వ్యవస్థయంతయు నిప్పుడల్లకల్లోల పరిస్థితులలో నున్నది. ఈ పరిస్థితిని మనము చక్కఁబెట్టక పోయినట్లయిన మన సైనికవ్యవస్థకూడ శిథిలము కాక తప్పదు. మనకు డబ్బు కావలయును. మనకు సాధనసంపత్తి కావలయును. దేశముకొరకు మనము సర్వస్వము త్యాగము చేయవలసియున్నది. లాభములు పోసికొనుట కిది తరుణము కాదు. ప్రతి కార్మికుఁడు, మిల్లుయజమాని, వ్యాపారి దానిని గుర్తింపవలసియున్నది. నిర్విరామకృషికి, నిస్వార్థపూరితసేవకు, నిది సమయము."

## మిల్లు యజమానులకు విజ్ఞప్తి

"పెట్టుబడిదారీ వ్యవస్థను నిర్మూలించనున్నారను బూటకపు కబుర్లు విని యుపోహపడవద్దని మిల్లుయజమానులకు విజ్ఞప్తి చేయుచున్నాను.

"మరొకచోట సంపద యెక్కువైన నిక్కడ దానిని మరొక విధముగా వినియోగము చేయవచ్చును. అట్లు గాక పోయిన దేశము సత్వరమే యధోగతిపాలై పోవును.

"అక్రమముగా లాభములు తీయుచున్నారను నిందకు మీరు వొడిఁగట్టక తప్పదు. మీరు స్వయంకృతమైన యిబ్బందు

లనే యెదుర్కొనవలసి వచ్చుచున్నది. నేను తిరిగి కంట్రోల్సు విధించుటవల్ల ననేకులు వర్తకులు, వారి గుమాస్తాలుకూడ నిరుద్యోగులై పోయినారు.

"మీ డబ్బువల్ల నెవరికి మేలుకలుగుచున్నదో యాలోచింపుడు. మీ డబ్బు విదేశస్థు లెవరికిని పోవుటలేదు. కేవలము మన దేశీయులకే చెందుచున్నది. మీరు బహిరంగముగా సంపాదించు పక్షమున ప్రభుత్వమునకో పన్నులో నెంత సంపాదించినను ఫరవాలేదు. ధరలు తగ్గించుటకు మీరు యథార్థముతో వ్యవహరించవలసియున్నది. ఇందు మీరే నాయకత్వము వహించి యుద్యమాదర్శమును ప్రారంభించవచ్చును. ప్రభుత్వము మీకు శత్రువుకాదు. దేశక్షేమము కాటంకముగా నున్నదని నమ్మకము కలిగినట్లయిన బ్లాకుమార్కెటు దారీతనమును వెంటనే తుదముట్టించవలసినదని నేనే ముందుగా ప్రభుత్వము సర్దించగలను. పరిశ్రమలను మీరు స్వతంత్రముగా నడుపగలిగిననే జాతీయము చేయుట మంచిది. మన ప్రభుత్వమును నిర్వహించుటకే తగు సిబ్బంది, చాలినంత ధనము లేకున్నది. మన యుద్యోగులను సంస్థానములకుగూడ బంపవలసివచ్చుచున్నది. అయినను నా సంస్థాన ప్రభుత్వములు సమర్థముగా నిర్వహించబడుటలేదు.

"అందుచేత మనలోనున్న యవినీతిని పూర్తిగా నిర్మూలింతము. ఈ పనిచేసి, సత్యము, ప్రేమ, న్యాయము ప్రబోధించిన గాంధీజీ యాత్మకు శాంతిచేకూర్చుదము. ఈపనిని మనము సాధించగలిగిననాడు మన దేశములో శాంతి భద్రతలను నెలకొల్పగలుగుదుము. ధరలు తగ్గిపోయిన నింక నెక్కువ సౌకర్యములు కావలయునని కోరుట సమంజసముకాదని కార్మి

నలే గుర్తింతురు. అంతేకాదు. సమ్మెలుచేయుటద్వారా లభించు నాయకత్వమట్టె నిలఁబడఁబోదని వారు గుర్తించగలరు కూడ. కార్మికులకు హానిచేయవలయుననికాని. యజమానులకు లాభముచేయవలయుననికాని కాక. మేము కేవలము దేశశ్రేయస్సుదృష్ట్యా ప్రభుత్వాధికారమును వహించుట కంగీకరించితిమి.

"యూరపును ఋణముద్ధరించుట కింగ్లండు, అమెరికాలెంత గట్టి ప్రయత్నముచేయుచున్నవో, యొక్కసారి యాలోచించుఁడు. ముప్పది నలుబదిలక్షల పౌనుల ఋణమును బ్రిటిషు ప్రభుత్వము ప్రారంభించనున్నదను సంగతిని మనము రెండు మూడు రోజులక్రితము విన్నాము. నేఁడు మేము ఋణముచేయఁ దలచుకొన్న నొక్కఁడును ముందుకు రాఁడు. అందుకుఁ గారణ మాదాయపు పన్నిగవేసినందు కెక్కడ సంజాయిషీ యడుగుదుమో యను భయమే.

## దేశమునకు మీ ఋణము తీర్చుకొనుఁడు.

"ఆదాయపు పన్నిగవేయువారిని వెదకి పట్టుకొని శిక్షించుటకు తగు సిబ్బందిని నియమించితిమి. వారొక ప్రశ్నావళిని జారీచేసినారు. వీరు తమ డబ్బునంతను రాఁబట్టుకొనుటకు రెండుసంవత్సరములు పట్టవచ్చును.

"ఇందువల్ల నెవ్వరికిఁ గలుగు ప్రయోజనమేమియు లేదు. అందుచేత దేశమునకు మీరు ఋణపడి యున్నదంతయుఁ దిరిగి యిచ్చివేయుఁడు. ఈ సందర్భములో మాకుఁ దోడ్పడవలసినదని యనుభవజ్ఞులందరికి విజ్ఞప్తి చేయుచున్నాను." యజ

మానుల కనుంఖాపము, సంపద, రెండును గావలసియుంటిగా నున్నవి. వాని శక్తిసామర్థ్యములను, సంపదను, దేశమునకు సమర్పించవలసియున్నది. అదియుఁగాక పోయిన దేశము సర్వ నాశనమై పోయినప్పుడు వారి సంపదయంతయు దక్కుటకుఁ గాజాలదు.

"బొంబాయి సమస్యను బెర్లిన్ సమస్యగా మాత్రము చేయకుఁడు, తరతరాలుగా శాంతిసద్భావములతో నివసించు చున్నప్పుడు గుజరాతీలు, మహారాష్ట్రులు నిప్పుడుమాత్ర మెందుకు శాంతి సద్భావములతో నివసించ లేరు ?

"మన యంతఃకలహములను మనమే పరస్పరసౌహార్ద్ర ముతోఁ బరిష్కరించుకొందము. ఈ సంకుచితరాష్ట్రీయ తత్త్వమునకు స్వస్తి చెప్పుఁడు. విద్వేషప్రచారము నుపకుఁ బూనుకొనకుఁడు. మన మిండియాను సుదృఢముగా నిర్మించవలసి యున్నది. ప్రపంచములోఁ గొలఁది దేశములుమాత్రమే యిండియాయంతటి బలసంపత్తికలవి. ఇండియా శ్రేయస్సు కొసమే మన ముత్పత్తి నిఁతోధికముగఁ జేయవలసియున్నది. మనము పరస్పరము సంప్రతించుకొని వ్యవహరించవలసియున్నది. అప్పుడే మనము దేశమునకు శక్తివంచనలేకుండ సేవచేసినట్లు కాఁగలదు. అప్పుడే మనము గాంధీజీ యనుయాయుల మనిపించు కొనుట కర్హులము కాఁగలము.

## స్వాతంత్ర్య వార్షికోత్సవ సందేశము

"స్వాతంత్ర్యముపొందిన తొలి సంవత్సరములోనే మనము కష్టపరంపరలలోఁ దలమునకలై పోయితిమి. కాని యకుంఠిత ధైర్యసాహసములను బ్రదర్శించుటవల్లనేమి, వజ్ర

సంకల్పముతో సహకరించుటవల్లనేమి, మన మా మహావిపత్తులన్నిటిని దాటి బయటపడగలిగితిమి. ఆ ధీరోదాత్త గుణసంపద మనకుఁ గొఱవడనంతవరకు, సుశిక్షితులైన సైనికులవలె, బాధ్యతాయుతముగా మనము ప్రవర్తించునంతవరకు, భవిష్యత్తు విషయమై మన మాశతో మెలఁగవచ్చును.

“భారత స్వాతంత్ర్య ప్రథమవార్షికోత్సవము జరుగుచున్న యీనాఁడు మన మనుసరించుచున్న యభ్యుదయమార్గములో మఱొక మజిలీ చేరుకొన్నాము. ఈ సందర్భములో నొక్కసారి మన పూర్వానుభవములను సమీక్షించుకొనుట సమంజసము. గత సంవత్సరము స్వాతంత్ర్యము సిద్ధించిన యీ రోజున మన హృదయము లెట్లుప్పొంగినవో యొకమాఱు జ్ఞప్తి చేసికొందము. ఆ మరుక్షణమునుండియే మనలను ముంచివేసిన కష్టపరంపరలు. పాకిస్థానులోఁ దమ సర్వస్వమును గోల్పోయి నిరాశ్రయులై లక్షలకొలది శరణార్థులు కట్టుగుడ్డలతోఁ దండోపతండములుగా నిండియను డొమినియనుకుఁ దరలి వచ్చుట, మన మనుగడనే భగ్నముచేయుటకు మన దేశములోనే కొంతమంది ప్రయత్నించుట, సుఖవిలసితమైన కాశ్మీర్ మాగాణములో శాంతియుతముగా జీవయాత్ర సాగించుచున్న నిస్సహాయప్రజలపైఁ బొరుగు దేశమునుండి దుండగీండ్రమానుష కృత్యములు జరుపుట, నిజాం సైనికదళముల యండదండలతో ఫాసిస్టుమూకలైన రజాకార్లు మన సరిహద్దులలోఁ బశుకృత్యములు కావించుట, స్వాతంత్ర్యము పొందిన తొలి సంవత్సరములోనే మనల నెదుర్కొన్న యితర క్లిష్ట జటిల సమస్యలు—వీని నన్నిటి నొక్కమాఱు జ్ఞప్తి చేసికొనుఁడు.

"అంతయు గందరగోళమై పోవునని, ప్రభుత్వము కూలి పోవునని తలపోసినవారు కొందరు లేకపోలేదు. మన దేశములోనే బయలు దేరిన యభివృద్ధి నిరోధకులతో, విధ్వంసకులతోఁ బ్రభుత్వము తలపడవలసి వచ్చినది. చేరువనుండి దూరమునుండి కూడ మనపైఁ గన్ను వేసిన దుష్టగ్రహముల బారినుండి మన దేశమును గాపాడుకొనవలసి వచ్చినది. ఏదైనను ప్రజల సాహాయ్యసంపదలవల్లనేమి, సముత్సాహపూరితులైన ప్రజాసేవకుల యవిరళ కృషివల్లనేమి, స్వాతంత్ర్యమునే తొడిచి పెట్టి వేయఁగల యీ మహోపద్రవములను దాటి బయటపడఁ గలిగితిమి. ఈ క్లిష్టదశాపరంపరలో మునిగియున్నందువల్ల నతిముఖ్యమైన యితర సాంఘికార్థిక సమస్యల పరిష్కారమునకు హృదయపూర్వకముగా నేము ప్రయత్నించలేకపోయితిమి. మన సర్వశక్తులు వినియోగించి కృషిచేసినప్పుడు గాని యీ సమస్యలకు నిశ్చితమైన పరిష్కారమార్గము లభ్యము కాదు—ఈమాట నమ్ముఁడు. యుద్ధమువల్లఁ గలుగఁగల విజయములకుఁ దీసిపోని శాంతి విజయసాధనకుఁ గృషి చేయవలయునని మేము చాల ప్రయత్నించితిమి. కాని విరామము లభించలేదు.

"గతసంవత్సరము మన హృదయములకుఁ దగిలిన గాయము లింకను మానిపోలేదను విషయము నాకుఁ దెలియును.

"తల దాచుకొనుటకు మాకు నీడఁ జూపింపుఁడు, మాకు బ్రతుకు తెరువు కల్పించుఁడని లక్షలకొలఁది శరణార్థులు నేఁడు మనలను బ్రశ్నించుచున్నారు.

"కాశ్మీర్ రంగములో దుండగీండ్ర యత్యాచారము

లింకను సాగుచునే యున్నవి. దేశవిభజనవల్లఁ గలిగిన యఘూతమునుండి మనము కోలుకోలేదు. అన్నింటికంటె నత్యంత విషాద సంఘటన భారతపిత దారుణహత్య—మన హృదయములను నింకను గెలఁకవేయుచున్నది. చీఁకటివేళల మనకుఁ దెన్ను చూపిన యా కరుణాజ్యోతి నేఁ డదృశ్యమైపోయినది. ఇక నార్థిక రంగములో నన్నియు సవ్యముగా జరిగిపోవుచున్నవను సంతృప్తితో వ్యవహరించుచున్నందున మన మిప్పటికి దెబ్బ తినుచునేయున్నాము. సమన్విత కృషి జరుగకపోవుటవల్లనేమి, యజమానులకుఁ గార్మికులకు మధ్య, సామరస్యము లేనందువల్లనేమి, మన మింకను చిక్కులకు లోనవుచునేయున్నాము.

"అందువల్ల గత సంవత్సరము మన యాశలలోఁ గొన్ని మాత్రము ఫలించినవి. అనుకొన్న యాపద లనేకము తప్పిపోయినవి మొత్తముమీద మనల నెదుర్కొన్న కష్టములన్నిఁటిని నెట్టుకొని వచ్చితిమి. గత సంఘటనలనుగుఱించి విచారము, భవిష్యత్తును గుఱించి భయాందోళనలు మన హృదయములలో ముప్పిరిగొనుచున్నవి. ఏ మహత్తరలక్ష్య సాధనకై, మనము స్వాతంత్ర్యసమరము సాగించితిమో, యా లక్ష్యమును విడనాడనంతవఱకు కెట్టి యకుంఠిత ధైర్య సాహసములతో, వజ్రసంకల్పముతో వ్యవహరించి మనల నెదుర్కొన్న ప్రమాదములనుండి బయటఁబడితిమో యట్టి ధీరోదాత్త గుణ సంపత్తి మనకుఁ గొఱవడనంతవఱకు సుశిక్షితులైన సైనికులవలె మనము బాధ్యతాయుతముగాఁ ప్రవర్తించినంతవఱకు – భవిష్యత్తుపట్ల మన మాశతో మెలఁగవచ్చును.

"వేయి సంవత్సరములు గడచినతర్వాత భౌగోళికముగా

నేకఖండితమైన భారతదేశములోని సువిశాల ప్రాంతమును ఏకఛత్రము క్రిందికి దీసికొని రాఁగలుగుట యిదే మొదటిసారి. పాలనాశక్తి జనులకును పునర్నిర్మాణకార్యక్రమము నింకను వెంటనే ప్రారంభము కావలసియున్నది. ఎన్నో యార్థిక సమస్యలన్నిటిని స్వాతంత్ర్యముతో ధైర్యసాహసములతో సర్వుల సహకారసుహృద్భావముతోఁ బరిష్కరించవలసి యున్నది.

“విదేశములతో మనకుఁగల సుహృద్భావన సంబంధ బాంధవ్యములను మఱింత స్థిరతరము చేసికొనవలసియున్నది. ఇఁక నంతరంగికవ్యవహారములలో మాకుసంబంధము లేని ప్రజాస్వామికలక్ష్యమును కనుగుణముగా నిజాము, సర్కారు, సుహృద్భావములతో మనము మెలఁగవలసియున్నది. ప్రభుత్వముపట్ల తమకుఁగల బాధ్యతలను ప్రజలెల్లరు గ్రహించవలయును. దేశము పట్ల ప్రతివారు భక్తివిశ్వాసములు కలిగియుండవలయును. రెండు ప్రభుత్వములపట్ల భక్తి విధేయతలు కలిగియుండువారి కిండియాలో స్థానము లేదు. ఆంతరంగిక సమస్యలను, వైదేశికసమస్యలను బరిష్కరించుటకై ప్రతివారును సహకరించవలెనని కోరుటకుఁ బ్రభుత్వమునకు హక్కున్నది. అందువల్ల స్వాతంత్ర్యముపొందిన యీ రెండు సంవత్సరములలో మన మీఁదఁబడిన బాధ్యతలన్నిటిని పూర్తిగా నిర్వర్తించితిమి. మన మాతృదేశ ప్రతిష్ఠను పెంచుటకు, మన మాతృదేశ శ్రేయస్సును బరిరక్షించుకొనుటకు మనమందఱము మనకృషిని నెరవేర్తిము. ఇంతకంటె నుత్తమమైన యాదర్శము నెవ్వరు నారాధించఁజాలరు. ఇంతకంటెఁ బవిత్రమైన బాధ్యత నెవ్వరు నిర్వర్తించఁజాలరు.”

# కర్మవీరుఁడు

కాంగ్రెసు మూలస్తంభములలో నాయన యొకఁడు. గాంధీజీతర్వాత కాంగ్రెసు విధాన నిర్ణేతలలో నగ్రస్థాన మాయనదే.

ఆయన పలుకే పెక్కుమందికి శాసనము. ఆయన యగ్నిగుండములో దూకుమన్నను వారు సంకోచించరు.

ఆయన యుపన్యసించిన నది సింహగర్జనమే. దేశభక్తుల నది యుత్సహింపఁ జేయును. విదేశీయ పరిపాలకుల నది కలవరపెట్టును.

సర్దార్ వల్లభాయిపటేల్ నాయకత్వమున కింతటిప్రతిభ, యింతటి విశిష్టత యేవిధముగా వచ్చినవి?

ఆయన నిష్కలంక దేశభక్తి యిందుకుఁ గారణమా? కాని దేశసేవానిరతిలో నాయనతో సమానులు కాఁగలవారు కూడ ననేకులు లేకపోలేదు.

కాఁగాఁ బాండిత్యములోఁ, బ్రతిభలో ధీరశక్తిలో దూరదృష్టిలో నాయనతోఁ బోల్చదగినవారేమి, యాయన కంటె మిన్నలైనవారేమి, దేశములోఁ గొందరు లేకపోలేదు.

అయినప్పుడు గాంధీగారితర్వాత దాదాపంతటి దేశ నాయకుఁడుగా నాయన యేవిధముగాఁ గాఁగలిగినాఁడను ప్రశ్న రాకపోదు.

ఇందుకుఁ బ్రత్యుత్తరము నొకే యొక పదములోఁ జెప్ప వచ్చును.

ఆ పద మిది — స్థి త ప్ర జ్ఞ త

భగవద్గీతలో స్థితప్రజ్ఞునిగుఱించి—పూర్ణమానవునిగుఱించి చెప్పఁబడిన నిర్వచనము సర్దార్ పటేల్‌కు దాదాపు పూర్తిగా వర్తించును.

ద్వంద్వములకాయన చాలవఱకతీతుఁడు. సుఖము వచ్చినప్పు డాయన యుప్పొంగిపోఁడు. కష్టము నెదుర్కొన్నప్పు డాయన క్రుంగిపోఁడు. విజయలబ్ధిలో నాయన గర్వభూతుఁడు కాఁడు. పరాజయము తప్పకపోయినప్పుడాయన విహ్వలచిత్తుఁడు కాఁడు. సహచరుల, ననుయాయుల నాయన మనఃపూర్తిగాఁ బ్రేమించును. అయినను వారిపట్లఁ గఠినముగాఁ బ్రవర్తించుట తన విధ్యుక్తధర్మమైనప్పుడు కాఠిన్యమును వహించుట కాయన సంకోచించఁడు. ఆయనలోఁగల యీస్థితప్రజ్ఞుని లక్షణముల కాయన జీవితచరిత్రలోఁగల తార్కాణము లశేషము, అగణితము.

ఒకనాఁడాయన యేదో నొక కోర్టులో నేదో నొక కేసులో వాదించుచున్నాఁడు. అప్పు డాయన సతీమణి పరమ పదించినట్లు వార్త చేరినది. ఒక్క త్రుటిపాటు– ఒక్క త్రుటిపాటాయన మ్లానవదనుఁ డైనాఁడు. ఆవెనువెంటనే తా నా యతి ఘోరదుర్వార్తను విననట్లే తనవాదనను దిరిగి కొనసాగించి నాఁడు. ఆ కేసులో గెలిచినాఁడుకూడ.

మరొకసారి యాయన శస్త్రచికిత్స చేయించుకొనవలసి వచ్చినది. "బాధతోఁగూడిన యాపరేషన్‌గనుక క్లోరోఫారము పుచ్చుకొనుఁడని డాక్టరెంతో దూరము చెప్పిచూచినాఁడు. కాని యందుకు సర్దా రియ్యకొననే లేదు.

కె. యఫ్. నారిమ ననిన నాయన కెంతో ప్రేమ. నారిమన్‌కూడ నాయనపట్ల నెంతో భక్తిప్రేమలను బ్రదర్శించు వాఁడు. "సర్దార్" అను బిరుదు కాయన తగినవాఁడని దానితో నాయనను బ్రప్రథమముగా సంబోధించినవాఁడుకూడ నారిమనే. అయినను నారిమన్‌పట్లఁ గాఠిన్యము వహించుట తన ధర్మమని తోఁచినప్పు డందు కాయన లవలేశముగానైన సంకోచించ లేదు!

ఇట్టి వ్యక్తినిగాకపోయిన మరెవరిని మనము స్థితప్రజ్ఞుఁ డని పేర్కొనఁగలము?

స్వధర్మనిర్వహణలో నిర్భీకత్వమును, నిశ్చలత్వమును బ్రదర్శించు కర్మవీరుఁడు గనుకనే సర్దార్ పటేల్ పైకిఁ గర్కశుని

వలెఁ గాన్పించవచ్చునుగాని యాయన మనస్సు వెన్నకంటె మెత్తనిది. ఆయనహృదయము చంద్రశిలకంటె స్నిగ్ధమైనది.

ఆయన యీ విశిష్టతయే యాయనను భారతదేశ రాజకీయరంగములో నేఁడింతటి ప్రముఖస్థానమును సంపాదించినది. కాని రాజకీయరంగములోఁగంటెఁ బ్రజాసామాన్యహృదయములో నాయన కధికస్థానము కలదు.

ఆయన న్యాయవాదివృత్తిని జేసియుండవచ్చును. రాజకీయవేత్తగా రాణించవచ్చును. కాని తన తాతముత్తాతలవలె నాయన స్వభావసిద్ధముగా సామాన్య కర్షకుఁడు. సామాన్య గ్రామీణుఁడు. అందువల్లనే యాయన కర్షకులను గ్రామీణుల నర్థము చేసుకోఁగలఁడు. వారుకూడ నాయన నర్థము చేసుకోఁగలరు.

పండితనెహ్రూ "నా సన్నిహితుల బృందము మధ్యనే నే నేకాకి"నని చెప్పియున్నాఁడు. ఇది సర్దార్ పటేల్ కణుమాత్రమైన వర్తించదు. ఆయన సామాన్య ప్రజల దృష్టిలో, ముఖ్యముగాఁ గర్షకుల దృష్టిలో- నన్ని సమస్యలను జూడఁగలఁడు. వారిలో నొకఁడుగా, లీనమైపోగలఁడు. వారి కష్టసుఖముల నాశ నిరాశలను బంచుకోఁగలఁడు.

ఇదే భారత కర్షకలోకము-ముఖ్యముగా గుజరాతీల కర్షకలోకముపై-నాయనకుఁగల ప్రాబల్యమునకుఁ గీలకము.

## 'సర్దార్ పటేల్'

* సందేహములు లేవు; సంశయములు లేవు. సంకోచములు లేవు. డోలాందోళన లేదు. తనలక్ష్యము లేవో తనకుఁ దెలియును. తనశక్తియుక్తు లేవో తనకుఁ దెలియును. తన బలప్రజ్ఞ లేవో తనకుఁ దెలియును. సమయాసమయములు తెలియును. పట్టువిడుపులు తెలియును. అందు చేతనే సర్దారు వల్లభాయి పటేల్ లాలించవలసిన వారిని లాలించఁగలఁడు. బెదరించ వలసినవారిని బెదిరించఁగలఁడు. కీలెఱిగి వాత పెట్టఁగలఁడు. అదనుజూచి దెబ్బతీయఁగలఁడు.

ఆయన ప్రవృత్తిలో నావేశము తక్కువ. ఆలోచన యెక్కువ. కారుణ్యము తక్కువ, కాఠిన్య మెక్కువ. వైవిధ్యము తక్కువ, విస్పష్టత యెక్కువ.

ఆయన దృక్పథము సంకుచితమైనదే, కాని, దాని సరిహద్దులు నిర్దిష్టమైనవి. ఆయన లక్ష్యములు పరిమితమైనవే, కాని వానిసాధనలో నాయనప్రజ్ఞావిశేషము లపరిమితము.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకున్న సంస్కృతి యాయనకు లేదు. అయితే "నేనటు పాశ్చాత్యసంస్కృతికిఁ జెందిన వాఁడనుగాను. ఇటు ప్రాచ్యసంస్కృతికిఁ జెందినవాఁడనుగాను. ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచములు రెండింటిలో దేనిలోను బూర్తిగా నిముడలేకపోవుచున్నా"నని నెహ్రూకుఁ బట్టిన బాధ యాయనకు లేదు.

*ఆంధ్రప్రభ ప్రధాన వ్యాసమునుండి

నెహ్రూకున్న విశాలాశయములుగాని, విశిష్టలక్ష్యములుగాని యాయనకు లేవు. అయితే "యెవరి జీవితమునకైన నైతికవిశ్వాసములు లంగరువంటివి. అట్టి లంగరునుండి నా సహచరులు నన్నీడ్చివేయుచున్నారని తోఁచినప్పుడు నా మనస్సులోఁ బెద్దతుపానులు రేగినవి. అయినను నేను రాజీచేసికొన్నాను. అది బహుశః తప్పేకావచ్చును. జీవితపు లంగరును విడిచిపుచ్చుట యే విధముగా నొప్పుకొనఁగలఁడను" నెహ్రూవలె బశ్చాత్తాపము చెందవలసిన యగత్య మాయనకు లేదు.

నెహ్రూవలె నాయన చుక్కలలోకిఁ జూడలేఁడు. అయితే నేలపై నడచుటలో నాయన యడుగులు తడఁబడవు.

నెహ్రూవలె నాయన కిట్టే కోపమురాదు. ఒకసారి కోపము కలిగించినవారిని సామాన్యముగా క్షమించ లేఁడు.

ఒక్కమాటలో నెహ్రూ స్వభావములోఁగల ద్వంద్వములు పటేల్ ప్రవృత్తిలో లేవు. తన కేమి కావలయునో యాయనకుఁ దెలియును. దానినెట్లు సాధించవలెనో యాయనకుఁ దెలియును. ఒక్కపనిచేయఁ దలచుకొనిన మొగమోటములకుఁ దావీయఁడు. మెత్తదనమును జూపఁడు. మొరటుగా నడచుకొనుటకైన వెనుదీయఁడు. ఎవరినైనఁ ద్రోసిపుచ్చగలఁడు. ఎంతకైనఁ దెగించగలఁడు. ఒక్కమాటలోఁ బటేల్ వాస్తవికవాది. వ్యవహారదక్షుఁడు.

ఇండియన్ యూనియన్ మంత్రులలో మరెవ్వరు సాగించలేక పోయినంతటి కార్యక్రమమును పటేల్ సాగించ

గలుగుటలోని రహస్యమిదే. దేశములో శాంతి భద్రితల రక్షణ కొఱకు నాయన యనుసరించిన పద్ధతులు మనకు నచ్చక పోవచ్చును. సంస్థానముల విషయములో నాయన యవలు జరిపిన విధానములు మనకు రుచించక పోవచ్చును.

ఇన్ఫర్మేషన్ అండ్ బ్రాడ్కాస్టింగ్ శాఖ పరిపాలన సందర్భములోనైన నాయన ధోరణిని మనము విమర్శించవచ్చును. కాని యీ యన్నింటిలోఁ దానేమి చేయదలఁచుకొన్నాఁడో దాని నాయన నిక్కచ్చిగాఁ జేసినాఁడు. కేవల మటునుండి నఱకుకొని వచ్చినాఁడు.

అందువల్లనే యాయన భావములతో నేకీభవించలేక పోవుచున్నవారుకూడ నాయన భల్లూక పుపట్టును బ్రశంసింపవలసి వచ్చుచున్నది. ఆయన విధానములను విమర్శించుచున్నవారు కూడ నాయన కార్యకుశలతను గాదనలేక పోవుచున్నారు. ఆయన దేశమును దప్పుదారిని బెట్టుచున్నాఁడని నమ్ముచున్న వారుకూడ నాయన గుడినేకాక గుడిలోని లింగమునుగూడ మ్రింగఁగల పాటివాఁడని యొప్పుకోవలసి వచ్చుచున్నది.

ఆయనపట్ల మీకు భక్తియుండవచ్చును. లేకపోవచ్చును. కాని యాయననుజూచి భయపడకతప్పదు. ఆయన కోరునదైనను మీ హృదయముఃకాదు. మీ విధేయతయే. ఆయనను మీఁరు ప్రేమించవచ్చును, ప్రేమించక పోవచ్చునుగాని యాయన రెండువైపులఁ బదనున్న కత్తిని బోలినవాఁడని గుర్తించక తప్పదు. ఆయన వాంఛించునదైన మీ ప్రశం... ...దు. తనపని చక్కఁబడుటయే.

నేటి దేశనాయకులలోఁ గొందరి కెంతటి యున్నత భావములున్నను, నుత్తమలక్ష్యము లున్నను నీవజ్రిసంకల్పము లేదు. ఈ కార్యదక్షత లేదు. నేటి మన దేశపరిస్థితులనుబట్టి యన్నిటికంటె నెక్కువగాఁ గావలసినది వజ్రిసంకల్పమే. కార్య దక్షతయే. కాఁబట్టి వీనిని ప్రదర్శించుచున్న పటేల్ నాయ నను విద్వేషించువారుకూడ మెచ్చుకొనక తప్పనిసందర్భములు కొన్ని వచ్చుచున్నవి.

అట్టి దొక సందర్భమే "చర్చిల్ నోటికిఁ దాళము వేయిం చకపోయిన జాగ్రత్త సుమీ!" యని యట్లీ ప్రభుత్వమును హెచ్చరించుచు నాయన చేసిన ప్రకటన.

# తాత్కాలిక ప్రభుత్వము

జర్మనీనియంత హిట్లర్ స్వీయరాజ్య విస్తృతికిగా నిరుగు పొరుగున నల్పరాష్ట్రముల నాక్రమింప సాగెను. ఇది క్రమముగ నభివృద్ధిపొంది తృతీయప్రపంచసంగ్రామముగఁ బరిణమించెను. బ్రిటిషువారు 1939 సెప్టెంబరు నెలలో జర్మనీపై యుద్ధము ప్రకటించిరి.

భారతదేశమునందుఁగూడ యుద్ధసంరంభ మేర్పడెను. ఈ సంగ్రామలక్ష్య మేమని కాంగ్రెసుప్రభుత్వము లడిగెను. బ్రిటిషువారు మిన్నకుండిరి. కొన్నిరాష్ట్రముల గవర్నర్లు కాంగ్రెసు మంత్రివర్గములకుం దెలుపకయే యుద్ధకృషి చేయసాగిరి. దీని కంగీకరించక, కాంగ్రెసు మంత్రులు, శాసనసభ సభ్యులు తమపదవులను వీడిరి.

తనలక్ష్యశుద్ధికై కాంగ్రెసు గాంధీజీ నాయకత్వమున 1940 సంవత్సరమున వ్యష్టిసత్యాగ్రహ మారంభించెను. యుద్ధమున భారతీయులు బ్రిటిషు ప్రభుత్వమున కెట్టి సాయము చేయఁగూడదని వెల్లడించెను.

ప్రపంచసంగ్రామము తీవ్రమాయెను. జర్మనీ, ఇటలీ, జపాను. దేశములకు జయపరంపర లభించుచుండుట చేతఁ గాంగ్రెసుతో నేదోవిధముగా రాజీపడఁదలచి బ్రిటిషు ప్రభుత్వము 1942 జులైలో సర్ స్టాఫర్డ్‌క్రిప్సును మన దేశమునకు రాయబారమంపెను. కాంగ్రె సాయన ప్రతిపాదనమును దిరస్కరించి బ్రిటిషువారు భారతమునుండి వైదొలఁగుటే తన

లక్ష్యమని తెలిపెను. 1942 ఆగస్టు 8వ తేదీన బొంబైనగర మున సఖిలభారత కాంగ్రెసు సంఘము క్విట్ ఇండియా తీర్మాన మును జేసెను. ఈ యుద్యమము నడుపుట యెట్లా యని యగ్ర నాయకు లాలోచించుచుండగా, ఆగస్టు 9వ తేదీ అర్ధరాత్రివేళ వారి నందరి నరెస్టు చేసి చెరసాలలో బంధించెను.

తమకుఁ బ్రియులైననాయకులు ప్రభుత్వమువారిచే నర్ధ రాత్రివేళ బంధింపఁబడుటచేఁ బ్రజలలో నలజడి యారంభ మాయెను. ప్రజలు గాంధీజీ బోధించిన యహింసాసిద్ధాంతమును విస్మరించి దౌర్జన్య పద్ధతులతో నాంగ్లేయులఁ దరిమివేయఁ గృత నిశ్చయులైరి. ప్రభుత్వ భవనములను, రైళ్లను, గూల్చ దోయుటే గాక, దేశములో గొప్పయలజడి, యరాచకము సాగెను. ప్రభుత్వమువారు ప్రజానాయకులను నిర్బంధించుటచే దేశ ములో స్వాతంత్ర్యోద్యమము సన్నగిల్లునని తలఁచిరికాని ప్రజ లుద్రిక్తులై విప్లవము సాగించిరి. ఈ ప్రజా విప్లవమే ఆగస్టు విప్లవమని విఖ్యాతి గాంచినది.

కాంగ్రెసు నాయకులను, గాంధీజీని విడుదలచేయవలయు నని దేశమున గొప్పయాందోళన చెలరేగెను. దీనికిఁదోడుగా భారతీయ నాయకులను విడిపించి వారితో రాజీపడవలెనని, అమెరికా చీనాల అధ్యక్షులును, బ్రిటిషు ప్రధానిని దొందర చేసిరి. 1944 నాటికి భారతదేశమునకు యుద్ధప్రమాదము పోయినది. 1944 మేలో గాంధీజీ నస్వస్థతకారణముచే విడుదల చేసిరి. క్రొత్తవైస్రాయి వేవెల్ గాంధీజీతో రాజీయత్నము చేయగాఁ గాంగ్రెసు కార్యసమితి సభ్యుల విడుదలఁజేసినఁగాని తాను రాజీలోఁ జొల్గొనననిపల్కెను.

అంతట వైస్రాయి కేంద్రశాసనసభలోని కాంగ్రెసు పక్షనాయకుడు భూలాభాయి దేశాయ్, ముస్లింలీగు నాయకుఁడు లియాకత్ ఆలీఖాఁ గారలతో రహస్యముగా రాజీమాటలు సాగించెను. ఈ రాజీపద్ధతిలోఁ గాంగ్రెసులీగులకు సరిసమానప్రతిపత్తి యిచ్చు పద్ధతిని కాంగ్రెసువారితోఁగలసి కేంద్రప్రభుత్వములో లీగువారు మంత్రులుగ నుండి పరిపాలన సాగించుటకును, గాంగ్రెసువారిని జైలునుండి విడిపించుటకును నేర్పాటు గావింపఁబడెను.

భూలాభాయి దేశాయి 1945 డిశంబరు 30 వ తేదీని అహమ్మదు నగర్ కోటకు వెళ్ళి సర్దారు వల్లభాయిని గలిసికొని సంభాషించెను. ఈ విధముగాఁ గాంగ్రెసు నాయకులందరు నాయన ప్రయత్నమువలనఁ గారాగారవిముక్తులైరి.

భారత దేశ రాజకీయ సమస్యలఁ బరిష్కరింపఁదలఁచి యప్పటి రాజప్రతినిధి వేవెల్ ప్రభువు 1945 జూన్ 4 వ వారమున భారతదేశమునందలి రాజకీయపక్షముల ప్రతినిధులను సిమ్లానగరమున కాహ్వానించెను. ముస్లింలీగు అధ్యక్షుడు జిన్నా హిందువులతో సమాన ప్రాతినిధ్య మీయవలెనని పట్టుపట్టెను. దీనికి కాంగ్రెసువా రంగీకరించనందున సిమ్లాసభ విఫలమయ్యెను.

1946 సంవత్సరమున భారతదేశమున జరిగిన శాసనసభల యెన్నికలలోఁ గాంగ్రెసువారి కఖండ విజయము చేకూరెను.

1946 మార్చిలో బ్రిటిషు ప్రభుత్వము సర్ స్టాఫర్డు

క్రిప్సు, సర్ అలగ్జాండర్, పెథిక్‌లారెన్సు, అను అమాత్య త్రయమును భారతదేశమునకు రాయబారమంపిరి.

ఈ రాయబారపు సందర్భములో వల్లభాయి 1946 మార్చిలో బొంబాయిలో నిటులు ప్రసంగించెను.

"భారతదేశ మీయేడు గడవకమునుపే స్వాతంత్ర్యము పొందఁగలదు. రాయబారమువచ్చిన బ్రిటిషు అమాత్యత్రయ ముతోఁ గాంగ్రెసు మైత్రితో మెలఁగును. పెక్కుమార్లు కాంగ్రెసు స్వాతంత్ర్య సంగ్రామము గావించినది. కాని ప్రస్తుతము మంత్రిత్రయముతోఁ జర్చించుటకే నిర్ణయించినది."

"ఈ చర్చలు విఫలమైనచోఁ గాంగ్రెసు తుదిసారి పోరాటము సాగించును. బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశము నుండి నిర్గమించునట్లు పాటుపడును."

అమాత్యత్రయ మాసేతు హిమాచలము పర్యటన మొనరించి యొక పథకమును సూచించిరి. కాంగ్రెసువారు దాని కంగీకరించిరి. తదనుగుణముగ 1946 సెప్టెంబరు రెండవ తేదీన నెహ్రూ ప్రధానమంత్రిగాఁ దాత్కాలిక మంత్రివర్గ మేర్పడెను. ఆమంత్రివర్గమున వల్లభాయి హోంశాఖను, ప్రచురణశాఖను నిర్వహించెను. ముస్లింలీగు ప్రతినిధులు తొలుత నీ మంత్రివర్గమునఁ జేరకుండిరి. వైస్రాయికోరుటచే తర్వాత వారును బ్రవేశించిరి.

# ఉపప్రధాని

"పరిపాలనలోఁ బాల్గొనుటకు బుద్ధిమంతులు నిరాకరించిన దుష్పరిపాలనక్రింద జీవితము గడుపు శిక్ష వారనుభవించవలసి యుండును." —ప్లేటో.

తాత్కాలిక ప్రభుత్వానంతరము వివిధరాష్ట్ర సంస్థాన ప్రతినిధులతో రాజ్యాంగ పరిష త్తేర్పడవలసియుండెను. కాని దీనిలోఁ బాల్గొనుటకు ముస్లింలీ గంగీకరింపదాయెను; ప్రత్యల్ప విషయమునకు నది వ్యతిరేకించుచుండెను. ఈ లీగుపరిస్థితిని గ్రహించి పటే లెవరు సహకరించినను, సహకరించక పోయినను బరిషత్సమావేశ మాగఁబోదని ఘంటాపథముగఁ జెప్పెను.

ఆయన చెప్పిన చొప్పుననే 1946 డిశెంబరు 9 వ తేదీ ననుకొన్నట్లు రాజేంద్రప్రసా దధ్యక్షుఁడుగ ముస్లింలీగు సభ్యులు హాజరు కాకపోయినను రాజ్యాంగపరిషత్తు ప్రారంభమాయెను.

ముస్లింలీగు నెహ్రూ ప్రభుత్వములోఁ జేరి యాంగ్లేయో ద్యోగులతోఁ గలసి ప్రతిష్టంభన కావించుచుండెను. అటుల ప్రభుత్వముతోఁగలసిరాక యిటుల రాజ్యాంగపరిషత్తులోఁ బాల్గొనక ద్విజాతిసిద్ధాంతమును బ్రచారముచేసి యా సిద్ధాంత సాఫల్యమునకై జిన్నాగారి యధ్యక్షతను 'డైరక్టుయాక్షన్' అనగాఁ బ్రత్యక్షచర్య యారంభించెను. ఇందువల్ల దేశ మంతట హిందూ మహమ్మదీయ కలహములు చెలరేగెను. పంజాబు, బెంగాలు, ప్రాంతములలో నీరక్తపాతము మఱింత హెచ్చుపెరిగెను. భారత స్వాతంత్ర్యసంపాదనకు భిన్నముగఁ

కొందరు దేశద్రోహులు చేయుచున్న దుష్కార్యములను గుఱించి మీరట్‌లో వల్లభాయి వివరించెను. దీనిని బహిష్కరించుకొని యాయన మహమ్మదీయ ద్వేషి యని, వారిపై హిందువులను బహిరంగముగ రెచ్చగొట్టుచున్నాఁడని గాంధీజీయొద్దఁ గొందరు ఫిర్యాదుచేసిరి. దేశమునఁ జెలరేగిన రక్తపాతమునకు వ్యథితుఁడై గాంధీజీ ఢిల్లీలో నుపవాసవ్రతము పూనెను! ఆ యుపవాస దీక్షలో మహాత్ముఁ డొకనాఁ డిట్లు పలికెను.

"సర్దారు వల్లభాయికి మహమ్మదీయుల యెడల విద్వేషమున్నట్లు పలువురు మహమ్మదీయమిత్రులు నాతోఁ బలికిరి. నా హృదయాంతరమునఁ జెప్పరాని యావేదన జనించినది. దానిని నాలోనే యణచివేసికొని వారు చెప్పినదంతయు వింటిని. పండిత నెహ్రూను నన్నుఁ గొండంతలుగాఁ గొనియాడుచున్న మీకు సర్దారు వల్లభాయిని మానుండి విడఁదీయుట యుచితము కాదు. అందఱను సమాదరించగల యుదారహృదయుఁడగు వల్లభాయి తలవని తలంపుగా నొక్కొకప్పు డొరులమనస్సు నొప్పి పడునట్లు మాటలాడుట గలదు. అతఁడు నా సహచరుఁడని, యావజ్జీవమిత్రుఁడని నే నాతనిఁ బూసికొనివచ్చుట లేదు."

"ఏ యహింసావిధానమున మన మిదివరలో విజయము సాధింపఁగలిగితిమో, యా యహింసావిధానమును బ్రభుత్వాధికారము హస్తగతమైన పిదప నవలంబింపలేమని యతఁడు గ్రహించెను. నేను నా సహచరులు దేని నహింసావిధానమని నిర్వచించుచుంటిమో యది సకరమగు నహింసావిధానము కాదనియు సాత్త్వికమగు నిరోధమున కనుకరణము మాత్రమే యనియుఁ గ్రమముగా గ్రహించితిమి. దేశపరిపాలనకుఁ గడంగిన

కానికి 'సాత్త్వికనిరోధ'మక్కఱకు రాదు. ప్రజల బాధ్యత వహింప వలసిన ప్రజాప్రతినిధియగు పరిపాలకుఁడే దుర్బలుఁడైనచో, నతని కాధిపత్యమొసంగిన ప్రజలగతి యేమి? సర్దారు వల్లభాయి తన్ను నమ్మినవారి నెన్నటికిని నట్టేట ముంచఁడనియు, వారిని హీనపఱచఁడనియు నాకుఁ దెలియును."

గాంధీజీ యుపవాస మొనర్చినను, మఱియెంతగా మొఱ పెట్టినను మతకలహాగ్ని చల్లారలేదు. ఈ యగ్నియిట్లుండగనే 1948 జూన్ నెలలోగా భారతదేశమునుండి బ్రిటిషువారు నిష్క్రమింతురనియు, నీలోగా భారతదేశ పరిపాలన మెవరికి స్వాధీనము చేయవలయునో నిర్ణయించుటకు లార్డు మౌంట్ బాటెన్‌ను రాజప్రతినిధిగాఁ బంపుచున్నామని బ్రిటిషు ప్రధాని పార్లమెంటులో 1947 ఫిబ్రవరి 27నఁ బ్రకటించెను.

లోగడ నిశ్చయము ప్రకారము మౌంటుబాటెన్ భారత దేశమునకువచ్చి కాంగ్రెసు ముస్లింలీగు నాయకులతో మంతన ములు జరిపెను. ముస్లిము లధిక సంఖ్యాకులుగనున్న పంజాబు, సింధు, బెంగాలు; సరిహద్దు రాష్ట్రముల గలిపి "పాకిస్తాన్" అనుపేర ప్రత్యేక రాజ్యమును నెలకొల్పవలెనని ముస్లింలీగు నాయకులు మంకుపట్టుపట్టిరి. ఇందువల్ల బీహారు, పంజాబు రాష్ట్రములలో హిందూముస్లిందొమ్ము లధికమయ్యెను. ఇందుచే సాధ్యమైనంత త్వరలో భారత దేశసమస్యా పరిష్కార ముచిత మని బ్రిటిషు ప్రభుత్వము నిశ్చయించెను.

మౌంట్‌బాటెన్ 1947 జూన్ 7 వ తారీఖున భారత నాయకుల నాహ్వానించి బ్రిటిషువారి నూతన పథకమును దెలియజేసెను. దానిలో సారాంశమేమన రెండుమూడు నెల

లలో బ్రిటిషు ప్రభుత్వము భారతపరిపాలనను దేశీయుల కొప్ప గించును. హిందువులు ముస్లిములు హెచ్చుగానున్న రాష్ట్రము లలో రెండు కేంద్రప్రభుత్వములు నెలకొల్పఁబడును. ఈ కేంద్ర ప్రభుత్వముల రెంటికి నధినివేశస్వాతంత్ర్య మీయఁబడును. ఇవి తమకిష్టమగుచో బ్రిటిషు రాజకుటుంబములో నుండవచ్చును; లేకున్న స్వతంత్ర రాజ్యములుగ నిర్ణయించుకొని వేఱుపడ వచ్చును. స్వదేశసంస్థానములు స్వతంత్రములగును. అవి యే యధినివేశములో నైనను జేరవచ్చును. కానిచో బ్రిటిషు ప్రభు త్వముతోఁ బ్రత్యేకముగా నొడంబడిక చేసికొనవచ్చును.

ఈ దేశ విభజనపద్ధతికిఁ దొలుదొలుత కాంగ్రెసు వారంగీకరించలేదు. కాని బ్రిటిషువారు ముస్లింలీగువారితో నేకీభవించి చేయుచున్న కుటిల రాజకీయ తంత్రాంగమువల్ల దేశమునఁ గల్లోలము పెచ్చుమీఱి రక్తపుటేఱులు పాఱుచుండు టచే గత్యంతరము లేక విదేశపరిపాలనవిముక్తికై యెట్టకేల కీ విభజన సిద్ధాంతమున కిష్టపడవలసి వచ్చెను.

ఈ ప్రణాళిక ననుసరించి బ్రిటిషు ప్రభుత్వము 1947 సం॥ జులై నాలుగవ తేదీని పార్లమెంటులో భారతస్వాతంత్ర్య శాసనమును బ్రతిపాదించెను.

ఈశాసనము ప్రకారము భారతదేశము విభక్తమై యధినివేశములుగా నేర్పడెను.

మద్రాసు, బొంబై, మధ్యరాష్ట్రము, సంయుక్త రాష్ట్రము, ఒరిస్సా, తూర్పుపంజాబు, పశ్చిమబెంగాలు, బీహారు, అస్సాం, (సిల్హెటు జిల్లా మినహా:) ఈ రాష్ట్రములతో ఇండియన్ యూనియ నేర్పడి దానికి రాజధాని ఢిల్లీ కాఁగలదు.

కరాచీ రాజధానిగా సింధు, సరిహద్దురాష్ట్రము, పశ్చిమ పంజాబు, పూర్వబెంగాలు, (సిల్హటుజిల్లాతో సహా) పాకిస్థానధినివేశముగా 1947 ఆగస్టు 15 వ తేదిన నవతరించెను.

1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశ విభజనయు, స్వాతంత్ర్యమును నొక్కసారిగ నేర్పడినవి. భారతదేశములోఁ గొంతిభాగము పరాయి ప్రాంతముగ విభజింపఁబడినను, కొన్ని శతాబ్దములనుండి పరపాలనకు లోఁబడిన దేశము. స్వాతంత్రము పొందినది. మౌంటుబాటెన్ భారతాధినివేశమునకు గవర్నర్ జనరల్‌గా నియమితుఁడయ్యెను. పాకిస్థానుకు జనాబ్ జిన్నా గవర్నర్ జనర లయ్యెను.

క్రొత్తరాజ్యాంగ పరిషత్తు 1947 ఆగస్టు 14 వ తారీఖున రాత్రి సమావేశమయినది. ఆ శుభముహూర్తమునకు మన స్వాతంత్ర్యరాజ్యచిహ్నముగ ధర్మచక్రగర్భితమగు త్రివర్ణపతాకమును సర్వసమ్మతితో రాజ్యాంగభవనముమీాద నెహ్రూ ప్రతిష్ఠించెను. ఆ పరిషత్తువారు నెహ్రూను నాయకుఁడుగ నెన్నుకొనిరి. నెహ్రూ, వల్లభాయి నుపప్రధానిగను, మఱికొందఱను వివిధశాఖామంత్రులుగను నెన్నుకొనెను.

ఉపప్రధానిగాఁ బటేల్ సంస్థానములు, దేశీయ ప్రచురణ శాఖలు చూచుచుండెను.

భారతదేశము స్వాతంత్ర్యము గాంచినందుకుఁ బ్రపంచమంతయు బ్రశంసించెను. భారతదేశమునఁగూడ, నానందోత్సవములు జరిగెను. అయినను దేశ మొకవంక విభక్తమైనదను దుఃఖము వెన్నాడుచునే యుండెను. స్వాతంత్ర్యానంతరము కూడఁ బెక్కుచోట్ల హత్యలు, గృహదహనములు, దోపిళ్లు,

సాగెను. పాకిస్తాన్‌లో నుండలేమని హిందువులును; భారత దేశములో నుండజాలమని ముస్లిములును భయపడి పోవుచ్చిరి. పాకిస్తానంతటను హిందువులహత్య, హిందూస్త్రీలయపహరణ యధికమయ్యెను. లక్షలాది సిరిసంపదలు దుర్మరణము నొందిరి. లక్షలకొలదిజనులు తరతరాలనుండి వచ్చుచున్న తమయాస్తిపాస్తులను ప్రియమైన జన్మస్థానమును విడి 'యాహి లక్ష్మణా' యని యితర ప్రాంతముల కేగవలసివచ్చెను.

ఇటుల దేశమంతట రక్తపాతము జరుగుచుండెను. విశేషించి పంజాబులో రక్తపాతము జరుగుచున్న సమయమున నమృతసర్ నగరమున కరిగి హింసకు ప్రతిహింస తగదనియు, పాకిస్థాన్‌కు బోదలచిన ముస్లిములను బోనిండని హితవు చెప్పి శాంతి నెలకొల్పెను.

కేంద్రప్రభుత్వపుటాస్తుల పంపకమువల్ల భారత ప్రభుత్వము పాకిస్తాన్‌కు 50 కోట్ల రూపాయలు చెల్లించవలసి వచ్చెను. పాకిస్తాన్ ప్రభుత్వముకూడ కొన్ని కోట్లు లియ్య వలసియే యుండెను. తా నియ్యవలసిన దీయక, తనకు రావల సిన దానికై పాకిస్తాన్ పట్టుపట్టసాగెను. దీనికి వల్లభాయి కోపోద్దీప్తుడై, 'పాకిస్తాన్ తాను జెల్లించువఱకును భారతప్రభుత్వము గవ్వకూడ నీయ'దని యుద్ఘోషించెను. పాకిస్తాన్ పాలకులకు బటేల్ పలుకులు శూలములవలె నుండెను. కొందరు ముస్లిం నాయకులు దీనిని గాంధీజీ కెఱింగించిరి. ఆయన మాటకు మాఱుని వాడగుటచే వల్లభాయి యా మొత్తము నిచ్చుట కంగీకరించెను. ఈ సందర్భములో బొంబై నగరమున నాయన పలికిన పలుకులు గమనార్హములు.

"మనము నీటికన్న నిర్లక్ష్యముగ ధనమును వెచ్చించుచున్నాము. 55 కోట్ల రూప్యములు చెల్లించుటతో గాంధీజీ సంతోషించు నెడ నాపని మాకు సమ్మతమే. గాంధీజీ క్రోధమున కతీతుఁడు. మన మందరము నాయన స్థాయి యందుకొనినఁ బోలీసులు, సైనికులు, చట్టములు, మొదలగునవి యవసరమే లేకుండును".

పాకిస్థాన్ దౌర్జన్యములకుఁ బ్రతిగ భారతదేశమున హిందువులు కొందరు ముస్లిములను హింసింపఁ దొడఁగిరి. అహింసావాదియగు గాంధీ దీని నరికట్టఁ జొచ్చెను. పాకిస్థాను గాంధీజీ బుజ్జగించుటవల్లనే హిందువులకు సర్వనాశనము కలుగుచున్నదని కొందరు హిందువులు భావింపసాగిరి. ఇది క్రమముగఁ బెరిగెను. పాకిస్థాన్ నుండి వచ్చిన కాందిశీకులకును, వారియెడ నభిమానము చూపించు నితరులకును, మహాత్మునియెడల ద్వేషభావ మేర్పడెను. ఈ దుష్పరిణామ ఫలితముగ మహాత్ముఁడు ఢిల్లీలో 1948 జనవరి 30 వ తేదీ సాయంకాలమునఁ బ్రార్థనాసమయమున నుపన్యసించుచుండ, గోడ్సే యను మహారాష్ట్ర బ్రాహ్మణయువకుఁడు తుపాకి ప్రేల్చగా నాయన 'హా-రామా' యనుచు నసువులఁ బాసెను.

గాంధీజీ జిన్నాతో మన మన్నదమ్ములమువలె విడిపోయెదమని యెంతో బుజ్జగించి చెప్పెను. ఆ మహమ్మదాలీ జిన్నా ద్విజాతి సిద్ధాంతమును నెలకొల్పి మహమ్మదీయులలో ద్వేషానలము రెచ్చగొట్టి-మనము విరోధులమువలె విడిపోవుదమని మహాత్మునితో వెల్లడించెను. "గాంధీజీ యీ విభజన సిద్ధాంతమున కిష్టపడఁడాయెను. గాంధీజీ శిష్యులలోఁ బ్రముఖు

లును, దేశములో మిక్కిలి పలుకుబడిగల నెహ్రూ పటేల్ లిరువురు నీ బ్రిటిషువారి పరిపాలన, మహమ్మదీయుల ద్వేషాగ్ని నుండి తప్పించుటకు దేశవిభజన కంగీకరించిరి. ఈ స్వాతంత్ర్య దేవత ప్రతిదేశమున నెంతో రక్తము బలిగొనినగాని ప్రత్యక్షము కాదాయెను – మన మీ దేవతకు రక్తము బలి యీయకయే స్వాతంత్ర్యము పొందితిమి. కాని యీ దేవత యూరకుండునా? లక్షలకొలది జనుల రక్తమును గ్రోలుటే గాక భారతదేశపిత, యహింసాధర్మబోధకుడైన గాంధీ మహాత్ముని రక్తమునుగూడ బలిగొనినది.

గాంధీజీ నిర్యాణమునకు లోకమంతయు దద్దరిల్లినది. భారత దేశమంతయు కన్నీరు మున్నీరుగా కార్చెను. దేశపిత హత్యావార్తను విని యెందరో యసువులుబాసిరి. స్వాతంత్ర్య దేవత యిప్పటికైనను దృప్తిచెందెనా?

గాంధీజీ నిర్యాణముచే వల్లభాయి తల్లిని గోల్పోయిన బాలునివలె నాయెను.

గాంధీజీ జీవించి యుండగనే భారతభాగ్యవిధాతలుగా నున్న నెహ్రూ, పటేలులలో నసైక్య మేర్పడినదని విని యాయన యెంతయో విచారించెను. తమలో నట్టి యనైక్య మేమియు లేదని వారిరువురు వెలిబుచ్చిరి.

ఈ యిరువురమధ్య విభేదము కల్పింప కొందరు కృషి చేసిరి. వల్లభాయిపటేల్ నెహ్రూకన్న వయస్సునబెద్ద. ఇంతే గాదు, సర్వశక్తి సంపన్నుడు. అయినను గాంధీజీ వారసుని నాయకత్వము క్రిందనే యాయన నిస్సంకోచముగను మన స్ఫూర్తిగను, బనిచేయుట ప్రశంసనీయము. ఇటువంటి శక్తి

సూచిన్నాఁడు, మఱియొకఁడుండిన నెహ్రూను బదభ్రష్టుని జేయుటకుఁ గృషిచేసియుండెడివాఁడే. క్రమశిక్షణాదీక్షాదక్షుఁడైన వల్లభాయి 1950 అక్టోబరు 2 న జేసిన ఇండోరులో నెహ్రూతో విభేదముల ప్రసక్తిఁ దెచ్చి పలికిన పలుకులే యిందుకు నిదర్శనము. ఆయన యిట్లన్నాఁడు.

"గాంధీజీ నడిపించిన స్వాతంత్ర్య భారత సైన్యములో మేమందరము సైనికులమే. డిప్యూటీ ప్రధాని నని నే నెప్పుడు ననుకొనలేదు. ఆవిషయము నెన్నడును బాటించనే లేదు. రాజకీయరంగములోఁ బ్రధానమంత్రియైన పండిట్ నెహ్రూయే నాయకుఁడు. ఇందుకుఁ దిరుగు లేదు. బాపూ బ్రతికియుండఁగానే తనకు నెహ్రూయే వారసుఁడు కావలయునని యెన్నుకొన్నాఁడు.

"అంధకార బంధురమైన యీ జగతికిఁ దాను జూపించిన దివ్యజ్యోతిని పండిట్ నెహ్రూయే పట్టుకొనఁదగినవాఁడని బాపూ పదేపదే స్పష్టముగా జెప్పినాఁడు.

"అందువల్ల భారతజాతిపిత గాంధీజీ యాశయమును నెఱవేర్చుట, యాయన భావములను గౌరవించుట మన విధ్యుక్త ధర్మము–బాపూజీ యాశయములను హృదయపూర్వకముగా సమర్థించనివారు దైవమునకే యపచారము చేయుచున్నట్టు లెక్క.

"నేనును గాంధీజీ సైనికులలోనివాఁడనే. బాపూజీ యాశయములను సయితము వెన్నుపోటు పొడుచు కిరాతకుఁడనుగాను. నిజమునకు నే నగ్రనాయకులలో నొకఁడనని యనుకొనుట లేదు. రాజకీయరంగములో నాకుఁగూడ స్థాన

మున్నమాట వాస్తవమే. గాంధీమహాత్ముని యనుచరులలో నొకఁడనుగా దేశమునకు సేవచేయుటకు నేను చేసికొన్న చేయూ స్థానము. నాకంతే చాలు."

ఇట్టిది వల్లభాయి మనః ప్రవృత్తి, మహాశయము. దీనిపై నింకను వ్యాఖ్యానమేల?

Politics means organised life of a nation- రాజకీయములనిన జాతియొక్క నియమబద్ధమైన జీవితము. అట్టి జీవిత మలవడినపుడే మన మభివృద్ధిఁ బొందఁగలము.

# సమైక్య నవభారతనిర్మాత

సంస్థానశాఖామాత్యుఁడుగా నుండి పటేల్ సాధించిన ఘనవిజయము భారత చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁ దగినది.

1947 ఆగస్టు 15 వ తేదీ బ్రిటిషు ప్రభుత్వమునకు స్వరాజ్య ప్రదానము చేసినమాట వాస్తవమే. కాని స్వరాజ్యము వచ్చినదని సంతోషము మినహా మనము ప్రాముకొన్నది యేమియు లేదు. దానికిఁ గారణము లనేక మున్నవి. స్వాతంత్ర్యానంతరము మన మనేకక్లిష్టసమస్యల నెదుర్కొనవలసి వచ్చినది. అందులో నధికభాగము బ్రిటిషువారి కుటిల తంత్రమువల్ల నేర్పడినవే.

దేశమును కృత్రిమముగా రెండుగాఁ జీల్చినందున మనము పొందిన నష్ట మొకటి. దానిని దలఁదన్నినది సంస్థానముల స్వాతంత్ర్యము మఱియొకటి. పోవుచుఁబోవుచు బ్రిటిషు

వారు స్వదేశసంస్థానములమీఁద బ్రిటిషురాజులకుఁ గల సార్వభౌమాధికారము రద్దయినదన్నారు. ఇంతేగాక ప్రతి సంస్థానము నొక స్వతంత్రరాజ్యముగా నేర్పఱచు హక్కు వానికి లభించుననికూడ సూత్రప్రాయముగా సూచించినారు. దీనివల్ల భారతదేశ మిండియా, పాకిస్థానులు, రెండుగానేగాక యూనియనందలు ముక్కలుగా విభాగమైపోఁగల ప్రమాద మేర్పడినది. భారతదేశమునకు స్వాతంత్ర్య మిచ్చుచుంటిమని చెప్పి బ్రిటిషువారు దేశమును ముక్కలు చేసి కల్లోలమునకుఁ గారకులైనారు. ఈ నింద తమ నెత్తిపైఁ బడకుండ సంస్థానములు సూత్రప్రాయముగా స్వతంత్రరాజ్యములైనను వాని స్వాతంత్ర్యమును దాము గుర్తించమని యేదో యొక యధినివేశములోఁ జేరిపోవలసినదే సని యనిరి. కాని నిజమున కిది వారు మన స్వాతంత్ర్యమునకుఁ గలిగించిన గొప్ప ముప్పు.. ఒక్క మాటలో వచింపవలెన్న వారు వచ్చిన స్థితిలో భారతదేశమును బెట్టి వెళ్ళిరి.

1946 సెప్టెంబరు 2 వ తేదీనుండి కేంద్రములో జాతీయ ప్రభుత్వ మున్నప్పటికిని ప్రత్యేకముగా సంస్థాన సమస్యలు పరిష్కరించుటకు 1947 జులై 5 వ తేదీని సర్దార్ పటేల్ క్రింద సంస్థానశాఖ యొకటి యేర్పడినది. కాని బ్రిటిషువారు స్వదేశ సంస్థానముల విషయమై చేసిన ద్వైధీభావ ప్రకటన వల్ల వచ్చిన స్వరాజ్యము దక్కునా యని యనుమానము కలిగినది.

ప్రతి సంస్థానము తనకు సమీపములో నున్న యధినివేశముతో నొడంబడిక చేసికొనుట మంచిదని బ్రిటిషు ప్రభు

త్వముపారు, గవర్నర్ జనరల్ మౌంట్‌బాటెన్ ప్రశం సించినారు.

సర్దార్ పటేలు మౌంట్ బాటెనులు సంస్థానాధిపతులతోఁ జేసినసమాలోచనల ఫలితముగా సంస్థానప్రభువు లధికముగా ఇండియన్ యూనియనుతో నొడంబడికఁ జేసికొనిరి. కాని కొన్ని తలతిక్క సంస్థానములు లేకపోలేదు. తిరువాన్కూర్ సంస్థానము తాను స్వతంత్రముగా నుండునని ప్రకటించినది. నైజాము తన రాజ్యపరిస్థితి ప్రత్యేకమైనదని, యందువల్లఁ దాను ఇండియన్‌యూనియన్‌లోఁ గాని పాకిస్థాన్‌లోఁగాని చేరఁజాలనని, యయినప్పటికి నిండియాకు రక్షణ కవసరమైన సహాయము చేయుదునని స్వాతిశయముగాఁ బ్రకటించినాఁడు.

గుజరాతులోనున్న జునాగడ్ నవాబు తాను జేరవలసిన యిండియన్ యూనియన్‌లోఁ జేరక మతాభిమానముతోఁ బాకిస్థాన్‌లోఁ గలిసినాఁడు. ప్రజలు దీని కిష్టపడక నవాబును బ్రోసిరాజు చేసి, తాము స్వతంత్రమును బ్రకటించినారు. అక్కడ నొక కల్లోలము బయలు దేరినది.

పూర్వ పాకిస్థాన్ (తూర్పు బెంగాల్) పూర్వసరిహద్దున నున్న త్రిపురస్టేటులోఁ బాకిస్థానుగుండాలు చేరి యల్లకల్లోల మారంభించగా నిండియన్ యూనియన్ సహాయము నర్థించగా నక్కడకు సైన్యమును బంపించి శాంతి నెలకొల్పుట జరిగినది.

కాశ్మీర్ తానే యధినివేశములోను జేరనని ప్రకటించినది. అంతట పాకిస్థాన్ ప్రభుత్వము కొండజాతులను పురికొల్పఁగా వారు గ్రామాలకు గ్రామాలను దోచుకొని పోవుటే గాక కాశ్మీర్‌నుగూడఁ గబళింపఁ బ్రయత్నించఁ గాశ్మీర

మిండియన్ యూనియన్ సహాయము కోరుటచే సైన్యాల నక్కడికి పంపి పాకిస్థాన్ సైనికులతోను, గోండుజాతుల వారితోను, పోరాడవలసి వచ్చినది.

హైదరాబాదు నైజాము నసమర్థతవల్లఁ గాశింరజ్వీ యనునతఁడు రజాకార్లను దోపిడిమూఁకకు నాయకుఁడై హిందువుల ధనమాన ప్రాణములు హరించుచుండఁగా ప్రజాశాంతి రక్షణకొఱకు నైజాముపైఁ బోలీసుచర్యలు తీసికొని మిలిటరీ గవర్నరు నధికారము క్రింద హైదరాబాదు నుంచుట జరిగినది. సంస్థానప్రభువు లను మత్తగజేంద్రములకుఁ బటేలువంటి యంకుశము లేకపోయిన వీరినిఁ బట్టపగ్గా లుండెడివి కావు.

వల్లభాయిపటేల్ తన రాజకీయధురంధరత్వమువల్ల స్వదేశ సంస్థానములన్నిటిని భారత సమాఖ్యక్రిందకుఁ దెచ్చెను.

ఆయన చతుస్సూత్ర ప్రణాళిక నొకదాని నేర్పాటు చేసెను అదేదన, నాయా సంస్థానములు కొన్ని చేరి యొకకూటమిగా నేర్పడుటయో, లేక పరిసర రాష్ట్రాలలో లీనమైపోవుటయో, లేక కేంద్రప్రభుత్వమున కధికారమును దత్తత చేయుటయో, సంస్థానములలో బాధ్యతాయుతప్రభుత్వమును నెలకొల్పుటయో, యైయున్నది.

## విలీనీకరణము

చిన్నచిన్న సంస్థానములలోఁ బరిపాలన భారత స్వాతంత్ర్య సంపాదనానంతరము కొనసాగించుటకు దుర్ఘటమైనది. వల్లభాయి యీ సమస్య నొక్క సంవత్సరములోగా

రెండు విధములఁ బరిష్కరించెను. మొదటిది విలీనీకరణము. రెండవది సమ్మేళనము. విలీనీకరణము ననుసరించి పరిసర రాష్ట్రములలోఁ జేర్చివేయబడినవి.

50 లక్షలు జనసంఖ్యగల సంస్థానములు ఒరిస్సా రాష్ట్రములోఁ బ్రప్రథమముగా 1948 జనవరి 1 వ తేదీనఁ గలిపివేయఁబడినవి.

14 సంస్థానములు మధ్యరాష్ట్రములో 1948 జనవరి 1 వ తేదీన జేర్చబడినవి.

మద్రాసు రాష్ట్రములోని బనగనపల్లి, పుదుక్కోట, సాండూర్ సంస్థానములుకూడ మద్రాసు రాష్ట్రములోఁ గలిపివేయబడినవి.

దక్కనులోని 17 సంస్థానములు 1948 మార్చి 8 వ తేదీన బొంబాయి రాష్ట్రములోఁ గలసిపోయినవి.

1948 మే 18 వ తేదీన 3 సంస్థానములు బీహారు రాష్ట్రములోఁ గలిసిపోయెను.

1948 జూన్ 10 వ తేదీన గుజరాతు సంస్థానము లను పేరుగల 157 సంస్థానములు బొంబాయిరాష్ట్రములోఁ గలిసి పోయినవి. బరోడా కొల్హాపూరువంటి గొప్ప సంస్థానములు కూడ బొంబాయి రాష్ట్రములో లీనమైనవి.

ఈ విధముగాఁ గొన్ని చిన్న సంస్థానములను బరిసర రాష్ట్రములలోఁ గలుపుట జరిగెను.

## సమ్మేళనము

కొంచెము పెద్ద సంస్థానముల సమస్యకు మఱియొక పరిష్కారము. అనగా సంస్థానముల నొక కూటమిగా నేర్పఱచుట. కూటమిగఁ జేరిన యీ సంస్థానముల పరిపాలన కొక కేంద్రప్రభుత్వ ముండును. పెద్ద హోదాగల సంస్థానాధీశు లొక మండలిగ నేర్పడి యైదుగురు సభ్యులుగల యొక యధిపతి మండలి నెన్నుకొందురు. దాని కొక యధ్యక్షోపాధ్యక్షు లుందురు. రాజ్యపరిపాలన విషయమున నధిపతిమండలి యధ్యక్షుని మంత్రాంగమునకు మంత్రివర్గ మెన్నుకోఁబడును. ప్రతి సంస్థానాధిపతి తన రాజరికము నధ్యక్షుని కప్పజెప్పవలెను. ఆ యధ్యక్షునికి "రాజప్రముఖ్" అని హోదా యుండును.

ఈ నియమముల ప్రకారము నైసర్గిక, సాంఘిక, భాషా, వైజ్ఞానిక సన్నిహితత్వములుగల పెక్కు సంస్థానములు సమ్మేళనములుగ రూపొందినవి.

217 సంస్థానములు జాగీర్లు కలసి సౌరాష్ట్రముగ నేర్పడినవి. దీనినే కథియవా డందురు. 1948 ఫిబ్రవరి 1 వ తారీఖున నీ సమ్మేళన మేర్పడెను. దీనికి నవనగర్ మహారాజు రాజప్రముఖ్.

ఆల్వార్, భరత్‌పూర్, ధోల్పూర్, కరవోలీ యీ నాలుగు సంస్థానములతో మత్స్యరాజ్య మేర్పడెను. ధోల్పూర్ మహారాజు రాజప్రముఖుఁడు.

బుందేల్‌ఖండ్, బగేల్‌ఖండ్, 35 సంస్థానములతో

వింధ్యప్రదేశ్ సమ్మేళన మేర్పడెను. దీనికి రివా మహారాజు రాజప్రముఖుఁడు.

విశాలరాజస్థాన్ పేరుతో 14 రాజపుత్రస్థాన సంస్థానములు కూటమిగా నేర్పడెను. ఉదయపూర్ మహారాజు రాజప్రముఖుఁడు.

'మధ్యభారత్' అను 22 మాలవసంస్థానములతో నొక సమ్మేళన మేర్పడెను. దీనికి రాజప్రముఖ్ గ్వాలియర్ మహారాజు.

పాటియాలాతోపాటు తొమ్మిది సంస్థానములు కలిసి 'పూల్కియా' సమ్మేళన మేర్పడెను. పాటియాలా మహారాజు దీనికి రాజప్రముఖుఁడు.

ఆఖరుగా 1949 జూన్ 1 వ తేదీని కేరళ యూనియ నేర్పడినది. ఇందులోఁ దిరువాన్కూర్, కొచ్చిన్ సంస్థానములు కలవు. దీనికి రాజప్రముఖ్ తిరువాన్కూర్ మహారాజు.

## కేంద్రప్రభుత్వము పత్తము చేసికొన్నవి

కచ్చి సంస్థానము బొంబాయి రాష్ట్రమున కుత్తరముగా పాకిస్థాన్ సరిహద్దులలో నుండుటచేత చీఫ్ కమీషనర్ రాష్ట్రముగా నేర్పడినది.

తూర్పు పంజాబులోని 21 సంస్థానములు హిమాచల ప్రదేశ్ అను పేరుతోఁ గేంద్రప్రభుత్వములోఁ జేరినవి.

భోపాల్, నేపాల్ సంస్థానములుకూడఁ గేంద్రప్రభుత్వములోఁ జేరినవి.

# బాధ్యతాయుత ప్రభుత్వము

సంస్థానముల విషయములో బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన సందర్భములో కేంద్రప్రభుత్వము చూపిన శ్రద్ధకు నైజాం విషయమే నిదర్శనము. మైసూర్, తిరువాన్కూర్ ప్రజాసమరములకు నైతికసహాయ మిచ్చినది. గ్వాలియర్, ఇండోర్, బరోడా, జోధపూర్, ఉదయపూర్, బికనీర్ సంస్థానము లవిషయములో కేంద్రప్రభుత్వము తన యాశయమును సాధించినది.

చేరనన్న కాశ్మీర్ శరణన్నది. స్వతంత్రముగా నుండుదనన్న తిరువాన్కూర్ తిక్క కుదిరినది. తన ప్రత్యేకతను ప్రకటించుకొండ మనుకొన్న నైజాముకు గోఅలుతీసిన పాముగతియే పట్టినది.

మైసూర్, జోధపూర్, జయపూర్ మొదలగు కొన్ని సంస్థానములు ఇండియన్ యూనియన్లో చేరినప్పటికి స్వతంత్రముగా నుండుటకు నిశ్చయించుకొన్నవి.

564 సంస్థానములలో 544 ఇండియాలో నున్నవి. వీని మొత్తము పాకిస్థాన్ మొత్తముకంటె నధికము. అనగా 8,88,00,000.

పటేల్ సాధించినదంతయు మితవాదకార్యమే యని తలచెడివారు లేకపోలేదు. దానికి సమాధాన మాంధ్రప్రభ యిచ్చినది గమనింపదగినది.

“సమయమున కిండియా స్వరాజ్యము పొందిన మరుక్షణ ములో నందరు సంస్థానాధిపతులను బహిభ్రష్టులను జేయవలసి నది; రాష్ట్రములకు, సంస్థానములకు మధ్యగల యున్న సరిహద్దు గీతలను చెరిపివేయవలసినది. అయితే యది విప్లవాత్మక చర్య ప్రణాళికల నాడంబడిక ద్వారా కాకుండ, జాతీయవిప్లవ ఫలి తముగా స్వరాజ్యము సిద్ధించినట్లయిన బహుశః యింతే జరిగి యుండును.

“సంస్థానముల నొక్కసారిగా రద్దుపరచివేయుట దుస్సాధ్యమైన పరిస్థితి. సంస్థానములలో వాని ప్రస్తుత మవ లంబించుచున్న విధానమే శరణ్యము.

“మనము కోరుచున్నంత త్వరగాఁ గాకపోయినను, గోరుచున్న రూపములోఁ గాకపోయినను—ఈ విధానము మొత్తముపై సత్ఫలితముల నిచ్చుచున్నది.

“ఈ విధానము దాదాపు 500 సంస్థానములను రెం డేండ్లలోపల నయిదారింటికిఁ దగ్గించినది. అందువల్ల దీనిలోఁ గొన్ని లోపములున్నను నిది మొత్తముపై హర్షించఁ దగి నట్టిదే కాఁగలదుగదా! సమ్మేళన విలీనీకరణ ద్వివిధ కార్య క్రమమును సంస్థానశాఖవా రనుసరించుచు వచ్చినారు. ఈ కార్య క్రమములో రెండవభాగమే యుత్తమమైనట్టిది. సమ్మేళనద్వారా సంస్థానముల సమస్య తెగుటకుమారు క్రొత్తచిక్కులు కొన్ని యేర్పడుచున్నవి కూడ. ఇందువల్లనే మధ్య యూనియనును విశాల రాజస్థానములోఁ జేర్చివేయవలసి వచ్చినది. మధ్య భారత్‌ను సి.పి. యు.పి. లలోఁ గలిపివేయవలయునా యని

యాలోచించవలసివచ్చుచున్నది. ఏనాటికైన, మనము సాధించవలసినది రాష్ట్రములకు - సంస్థానములకు రాజ్యాంగరీత్యా యేమి, యన్యరూపములలో నేమి, యెట్టి భేదము లేకుండఁ జేయుటయే. (ఆంధ్రప్రభ. 1948 మే-31.)

జమీందార్లు, సంస్థానాధీశులు, బ్రిటిషువారిచే నిలుపఁబడిన పరపీడకులు. వారున్నంతవరకు నీరుండిరి. వారికిని వీరికి సంబంధమే. అయితే యాపని మనపరిస్థితుల ననుసరించి పటేల్ చేయుచున్నాఁడు.

ఇండియన్ యూనియన్‌లో సంస్థానముల ప్రవేశ మను విజయమెట్టిదో భారతప్రభుత్వము ప్రకటించిన "వైట్ పేపరు" వల్ల విదితము కాఁగలదు.

"ఇండియన్ యూనియన్‌లో నిండియా సంస్థానములు ప్రవేశించుట యపూర్వసంఘటన. సంస్థానముల పూర్వచరిత్ర పరిశీలించిన దీని ప్రాముఖ్యము విదితమగును. కడచిన నూఁటబది యేండ్లుగ సంస్థానములు బ్రిటిష్ భారతప్రజానాయకులకు మెట్టరాని కోటలుగాఁ గొలుకరాని కొయ్యలుగ నుండినవి. సంస్థానములలో స్వాతంత్ర్య ప్రజాస్వామ్యోద్యమములు చొరఁబాలనట్టి యినుపకోటలు కట్టఁబడినవి. అభివృద్ధినిరోధకులకు, విధ్వంసకులకు, సంస్థానములు తావులై యుండెడివి. ఒకటి కాక పది రాజస్థానముల నిర్మాణమునకు సన్నాహములు జరిగినవి. విభజనవల్లను, సంస్థానముల మంకుపట్టువల్లను, భారత ప్రభుత్వ పతన మనివార్యమని పలువురు భావించిరి.

"రాజకీయస్వేచ్ఛయే యాదర్శముకాదు; అది ప్రజాభ్యుదయమునకు సాధనము మాత్రమే. సంస్థానప్రభుత్వము

లకుఁగూడ నిదే గమ్యావధి; ఇదే సంస్థానములకుఁ బరీక్ష. పెక్కుసంస్థానములు మున్నీ పరీక్షలో నెగ్గలేదు. నిరంకుశములుగాఁ బ్రవర్తించెడివి; ప్రజల యోగక్షేమములయెడ శ్రద్ధవహించెడివి కావు. మధ్యయుగముల జమీందారీహయాము నడిపినవి. పలు సంస్థానములలోఁ బ్రధానప్రభుత్వకార్యాలయములుకాని, స్వతంత్రన్యాయస్థానములుకాని, ముఖ్యములైన యితరకార్యాలయములుకాని లేవు. ప్రజల యోగక్షేమములకు సరియగు ప్రణాళికలే లేవు. ఈ లోపముల సవరించి నూతనపరిపాలనము నేర్పాటు చేయవలెను. నిరంకుశాధికారము సమాప్తమాసి బాధ్యతాయుతప్రభుత్వము నెలకొనినప్పుడే పరిపాలనమున నూతనత్వము విలసిల్లును."

పటేలెన్నడో యీ సంస్థానములను నాశనము చేయుదునని శపథము చేసెను. ఆయన పలికిన పలుకు తప్పక నెఱవేర్చుకొనఁగలిగినాఁడు.

బార్డోలీ సత్యాగ్రహోద్యమమును నడుపుచు పటేల్‌జీ యొకయుత్తరములో "బ్రిటీషు సామ్రాజ్యాంతమునేగాదు, స్వదేశసంస్థానరాజరికములనుగూడ నీ దేశమున నామరూపరహితము చేసితీరుదు" నని వ్రాసి ప్రత్యేకదూతద్వారా దానిని నాటి బొంబాయి గవర్నరు కంపజేసెను.

ఆనాడు పల్కిన పలుకులను నేడక్షరాలఁ గార్యాచరణలోఁ బెట్టి పటేల్ మహితప్రతిజ్ఞాపాలకుఁడైనాఁడు.

ప్రపంచము కని విని యెఱుఁగనిరీతిగా సంస్థానముల సమస్యను బరిష్కరించిన యీ ఘనత యాయన కొక కీర్తికిరీటము.

మన దేశము చక్రవర్తిక్షేత్రమనియు, నైకైక కేంద్ర ప్రభుత్వ పాలనమున నుండెదగుననియు, గాటిల్యాదు సిర్వ చించిన లక్ష్యము నేటికి సర్దారు పటేల్ ద్వారా సార్థక మైనది.

## అస్తమయము

"కష్టి శోభించును. ఒకి క్షీణించును;
శరీరము నశించును, ఆత్మ నశించదు."

—బైరన్.

వల్లభాయిపటేల్ గాంధీజీ యనుచరులలో నన్నిటఁ బెద్దవాఁడు. వార్ధక్యదశలో నిరంతరకార్యనిమగ్నుఁడై యుండుట చేత నాయన యారోగ్యము చెడెను. 1948 నుండి యాయన యనారోగ్యదశలోనేయుండెను. స్వాస్థ్యమునకై మాంటిసోరీలో నివసించుట యనవసరమని వైద్యులు వచించిరి. అచట నుండఁగనే హైదరాబాదు కల్లోలము పెరుగుటచే విశ్రాంతి తీసికొనకయే యాయన మరలఁ గార్యభారము వహించవలసివచ్చెను.

ఆయనకుఁ గార్యభారముతోపాటు వార్ధక్యముగూడ నధికమాయెను. ఆరోగ్యము క్షీణించెను. ఢిల్లీలో నాయనకు సుస్తీ ప్రారంభముకాఁగా, నక్కడి వాతావరణముకన్న బొంబాయి వాతావరణములో నాయన కారోగ్యము చేకూరు నను నాశతో వైద్యుల సలహామీద 1950 డిశంబరు 12 వ తేదీ విమానముమీఁద వచ్చెను. అప్పటినుండి బిర్లాభవనము లోనే యుండెను.

బొంబాయికి రాఁగానే ఆ వాతావరణములో నాయన కొంచెము తేఱుకొన్నట్లే కనుపించెను. కాని 13 బుధవారము రాత్రి పొత్తికడుపులో బాధ యెక్కువయ్యెను. 15 వ తేదీ శుక్రవారము తెల్లవారుజామున 3 గంటలకల్ల నాయన హృదయమునకు నిరోధము కల్గెను. వైద్యులు వచ్చి పెక్కు చికిత్సలు చేసిరి. ఉదయము 8 గంటల కాయనకుఁ గొంచెము స్పృహవచ్చెను. ఆ స్పృహ తుదివఱకు నుండెను. ఆయన కుమార్తె మణిబెన్, కుమారుఁడు దయాభాయిపటేలాయనకు సర్వసపర్యలు చేయుచుండఁగా, సరిగా 9 గంటల 37 నిమిషములకు బార్డోలీ సత్యాగ్రహ సమరసేనాని, స్వతంత్ర భారతరథ చోదకుఁడు, సమైక్య నవభారతనిర్మాత, మన సచివుఁడు, సోదరుఁడు, సర్దార స్తమించెను.

ఈ సంగతి వల్లభాయి ప్రైవేటుకార్యదర్శియగు శంకర్, ప్రధాని పండిట్ నెహ్రూకు, ప్రెసిడెంటుకుఁ దదితరమంత్రులకు బొంబాయిలోని మంత్రులకు టెలిఫోన్ చేసినాఁడు.

ఈ సంతాపవార్త వినినంతనే బొంబాయిమంత్రులు సర్దార్ భవనముఁ జేరిరి.

వేలాది స్త్రీ పురుషులు సర్దారును తుది దర్శనముచేసి విలపించసాగిరి. బిర్లా భవనమంతయు జనారణ్యమైయుండెను. ఢిల్లీనుండి సాయంకాలము 4 గంటలకుఁ బ్రెసిడెంటుప్రసాద్, ప్రధాని నెహ్రూ, తదితరాధికారానధికారప్రముఖులు వచ్చిన యనంతరము వల్లభాయి యంత్యక్రియలు ప్రభుత్వ లాంఛనములతో నాయన యగ్రజుఁడు విఠలభాయి పటేల్‌కు జరిగిన సోనేపూరు శ్మశానములోనే జరిగెను.

వల్లభాయి నిర్యాణమునకు భారతదేశమంతయు దుఃఖ సముద్రములో మునిగెను. తండ్రితోపాటు సోదరునికూడఁ గోల్పోయితిమని ప్రముఖనాయకులేగాక ప్రజలందరుకూడ విలపించిరి.

భారతదేశమందేగాక ప్రపంచము నలుదిశలనుండి యీ మహాభావుని మరణమునకు విచారసూచనలు వెలువడెను.

## నెహ్రూ-పటేల్

పొట్టునుండి పప్పును వేఱుచేయుటలో వల్లభభాయి కత్యద్భుతమైన సామర్థ్యమున్నది. జవహర్లాలువలె, నావలె నతఁడు భావనా స్వప్నప్రపంచములోఁ దిరుగువాఁడుకాదు. ధీరత్వ విషయములో నతనితో సమాను లుండిన నుండవచ్చును గాని, మించినవారుమాత్ర ముండరు. స్థిరసంకల్పుఁడు. ఏవిషయములోనైన నొక నిశ్చయమునకు వచ్చిన నంతే; దానికిఁ దిరుగులేదు. ప్రజాసేవయే యతని నిత్యైకసాధన. దేనికయిన లక్షణనిరూపణచేయుటకు జవహర్లాలు; ఆ లక్షణముల ననుసరించి కార్యక్రమ నిర్ణయము చేయుటకుఁ బటేలు. కాఁబట్టి జవహర్లాలు నడిగి లక్షణములు తెలిసికొనుఁడు, పటేలు నడిగి క్రియాకలాపము గ్రహించుఁడు.

—మహాత్ముఁడు

స్వతంత్ర భారతీయతకుఁ బ్రపంచ మెఱిఁగిన బాహ్య చిహ్నము పండిట్ నెహ్రూ; అంతశ్శక్తి పటేల్.

విడివిడిగాఁ జూచుకొన్న రెండు విరుద్ధభావములేమో యని భ్రమ కల్పించునంత విపరీతములు. కాని పరిపూర్ణతా పుష్టమైన యేకశక్తి, ద్విధాగతరూపము నంది సరస్పరనోపకముగానైన విచిత్ర సంస్థ—ఆ యిరువుర కూటమి

మహాత్ముని నాయకులను దేశమున తప్పి జెప్పాటులోఁ దన ప్రతిభను జూపించినాఁడు. దేశభక్తి, గురుదేవుఁడగు మహాత్మునియందు భక్తి; యీ సూత్రములే వారిరువుర నేకము చేయు దృఢబంధనములు. ఈ యిరువుర స్వభావముల తారతమ్య వైచిత్రిని, సంకలనాలబ్ధపరిపూర్ణతను, డాక్టరు బాల కృష్ణ కేస్కారుగారి వ్యాసములోఁ జక్కఁగాఁ జిత్రించిరి.

"భారత దేశమును ప్రస్తుత మావరించియున్న గందరగోళము, ననిశ్చితమై సిరంతరము మారుచున్న వాతావరణములలోఁ బండిట్ జవహర్ లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేలులు చలాయించుచున్న యనితరలభ్యాధికార మొక్కటే నిశ్చితముగా, స్పష్టముగాఁ గన్పడుచున్నది.

"వారిద్దరు భారత దేశసంయుక్తనియంతలని చెప్పవచ్చును. కాని యీ యధికారమును వా రెట్టి కుతంత్రముద్వారా సంపాదించి యుండలేదు. పరిస్థితులు వారికీ యధికారమును గైవసమొనర్చినవి. ఈనాడు ప్రభుత్వములోను, బయటను సర్వము వారే నడుపుచున్నా రనుట నిస్సందేహము. మహాత్మ గాంధీ జీవించియుండఁగానే నాయన వీరిద్దరిని సమన్వయపఱచుచుండెడివాఁడు. వీరిద్దరు నాయన మహావ్యక్తిత్వముద్వారానే యుత్తేజము పొందినారు. ఆయన పరమపదించిన తరువాత భారతభాగ్యవిధాతలు వీరే యైనారు.

## అనిశ్చితము

"భారతదేశము చరిత్రలో నతిక్లిష్టసమయములో నిప్పుడున్నదని గుర్తించినచో నీ విషయము మఱింత ప్రముఖముగాఁ గనుపించఁగలదు. దేశ మిప్పుడే విదేశపరిపాలననుండి విముక్తమైనది. వెంటనే కని విని యూహించి యెఱుఁగనంతటి క్లిష్టసమస్యల నెదుర్కొనవలసివచ్చినది. అంతరంగభేదాభిప్రాయములు పలురకములై యనేకములుగా నున్నవి. నూతన ప్రభుత్వము స్థిరపడుటకుఁగూడ నవకాశము చిక్కలేదు. పంజాబ్, సింధులనుంచి కాందిశీకులరాక లన్ని ప్రణాళికలను దాఱుమారొనర్చినవి. కాశ్మీర్, హైదరాబాదులు కొఱుకరాని కొయ్యలుగా నున్నవి పాకిస్తాన్ శాశ్వతవైరుధ్యము, చాల మంది ఇండియన్ ముస్లిములు దానిని హర్షించుటవలన దేశమునకుఁ ప్రమాదము వాటిల్లఁజేయవచ్చునను భీతి వ్యాపించినది.

ఇటువంటి యనిశ్చితపరిస్థితిలోఁ బ్రతి విషయము నీ యిద్దరు రాజకీయ నేతల ప్రవర్తనపైనే యాధారపడియుండునని దినదినము తేలిపోవుచున్నది. వారిద్దరి పరస్పరసంబంధములు, దేశము నెదుర్కొనుచున్న పలుసమస్యలను వీరెదుర్కొను విధానము, విడివిడిగాఁగాని, సంయుక్తముగాఁగాని, వీరుచేయు నిర్ణయములు, భారతదేశ భవిష్యత్తును, కొన్ని తరములవఱకు, నిర్ణయించును. ఒకవిధముగాఁ జూచినచో భారతదేశ భవిష్యత్తీయిద్దరువ్యక్తుల ప్రవర్తనపై నాధారపడియుండుట శోచనీయముగానే కన్పట్టును. కాని

యున్న పరిస్థితి యిది. బహుశః కొంత డజనుమందిపై నాధారపడి యుండుటకంటె, సర్దారుపైనే యాధారపడి యుండుట మంచిదేమో !

ఏ విధముగాఁ జూచినను నెహ్రూ—పటేల్ కూటమి యాశ్చర్యజనకమైనది. అది విరుద్ధశక్తుల విచిత్రస్నేహము. ఒక విధముగాఁ జూచిన, అది యొకదాని నొకటి పూర్తిచేయునట్టి కూటమి. పండిట్ నెహ్రూ యాంగ్లశిక్షితుఁడు. విజ్ఞానవంతమగు ధనికకుటుంబమునకుఁ జెందినవాఁడాయన. ఆయన చిన్నప్పటినుండి యింగ్లండులోఁ బెరిగెను. అందువలన జీవితములో ననేక విషయములపై నాయన యింగ్లీషు దృక్పథముతోనే యాలోచించును. వైజ్ఞానికముగ నాయనకు సోషలిజమన్న నమ్మకము, గౌరవము కలదు. కాని సామాజిక జీవితములో నలవాట్లలో నాయనది పూర్తిగా శ్రీమంతులవిధానము. నాయకత్వమును బొందుట కాయన యితరులవలెఁ గష్టపడవలసిన యవసరమే లేకపోయెను.

తన రాజకీయ జీవితములోఁ బ్రారంభమునుండియు తన తండ్రి, గాంధీజీల ప్రోద్బలముతోఁ బండిట్ నెహ్రూ ముందుకు నెట్టఁబడెను. తన కా ప్రోద్బలముద్వారా లభించిన పదవుల స్థాయికిఁ దనకు స్వతః యున్న శక్తిసామర్థ్యములవలన నాయన రాఁగలిగెను. కాని చులుకనగా లభించిన యీ నాయకత్వ మాయన రాజకీయానుభవములో నొక శూన్యత నాపాదించి, రాజకీయ సమస్యలను, రాజకీయముల నాయన యొక విచిత్ర ధోరణిలోఁ బరిశీలించునట్లొనర్చినది. ఆయన యుదారస్వభావుఁడు. గౌరవనీయుఁడు. మంచి సంస్కృతి, రసజ్ఞానము కల

వాఁడు. కవిత్వమన్న నాయనకుఁ బ్రీతి. రచయితగా నాయన గణనీయుఁడు. రాజకీయకుతంత్రములు, కుట్రలు నాయనకు నచ్చవు ఆయన యాదర్శవాది. గతములైన రెండు దశాబ్దములనుండి యాయనకుఁ బ్రజలలోఁగల పలుకుబడివలనఁ బ్రజలాయనయన్న మిక్కిలి గౌరవింతురు. ఆయనకుఁగూడఁ బ్రజాసమూహమన్నను, వారి హక్కులన్నను ప్రీతి. ఆయన సాహసవంతుఁడు. భావోద్వేగి.

## అనుష్ఠాన రాజకీయవేత్త

సర్దార్ పటేల్, కష్టించి పనిచేసెడి, పొదుపరులగు వ్యవసాయదారుల కుటుంబములో జన్మించెను. ఆయన గుజరాత్‌లోని బార్ త్తర్ పటేదార్ వంశమునకుఁ జెందినవాఁడు. ఈ వంశస్థులు కొంచెము తలబిరుసైన యూహావిహారులుగాక యనుష్ఠానపరులు. ఆ వంశగుణము లీయనలో మూర్తీభవించినవి. ఆయనయు, నాయన సోదరుఁడు, విఠల్‌బాయి పటేలును, జాకచక్యముగల సమర్థులగు యోధులు. ఆయన కటువగు మితభాషి. రసజ్ఞత, కళలన్న నాయనకు బిడియము. ఆయనది కేవలము భారతీయదృక్పథము. ఆయన జన్మతః యోధుఁడు. సంఘటనాశక్తిగలవాఁడు. రాజకీయతంత్రములందుఁ బ్రవీణుఁడు. రాజకీయపు టెత్తులు వేయుటలో నాయన యద్వితీయుఁడు. విరోధులపట్ల నాయన నిర్దాక్షిణ్యుఁడు. రాజకీయముగా నడ్డంకని సర్దార్ భావించినవాఁ డేనాటికైనను నణఁగ ద్రొక్కఁబడుననుట నిశ్చయమే. ఆయన గొప్ప ప్రజానాయకుఁడు. ఎట్టి సమస్యలనైనను దేలికగ గ్రహింపఁగలఁడు. దేశ

ముఖ్య సంక్లిష్టసమయమున నాయన వాస్తవికదృక్పథము బాగుగా నుపయోగపడినది. ఆయన కఠినదృఢస్వభావుడు. కాంగ్రెసు సంస్థలో యూరోపియన్ దృక్పథముతో జూచిన, నాయన యొక్కడే గొప్ప రాజకీయవేత్త. ఆయన భారతదేశపు బిస్మార్కు. వ్యక్తిగతముగా నాయన ధీరుడు. ఎట్టివారికి భయావహుడు. కాని యాయన నెఱిగినవా రాయనలో ననేక గుణములను ప్రేమింపకపోరు. ప్రతివిషయము జాగ్రత్తగా నుద్వేగ్నుడుగాకుండ నాలోచించును. సోషలిజమన్నను సోషలిస్టులన్నను నాయనకు దలనొప్పి.

## విరుద్ధశక్తులు

నెహ్రూగా రేకాంతవాసప్రియుడు. కాంగ్రెసులో వర్గవిభేదముల కాయన యతీతుడుగా నుండుట యలవాటయి పోయినది. ఆయన రాజకీయపు పెంపకమాయనకు కుతంత్రములన్న ననిష్టత కల్గించినది. తనచుట్టు వందిమాగధులవలె ననుచరులు తిరుగుచుండుట యాయన కిష్టములేదు. అది తన ప్రతిష్ఠకు భంగకరమని యాయన యుద్దేశము. ఆయన ప్రతివిషయములోను స్వీయోద్దేశముల ప్రకారమే వ్యవహరించును. ఆయనది యొక మానసిపాట్టి.

సర్దార్ పటేల్ పుట్టుకతోనే సంచాలకుడు. అది స్వభావసిద్ధమని యాయన భావించుచుండును. చతురత, సంఘటనాశక్తి ద్వారా యాయన తన బలగమును బలుకుబడిని సాధించుకొనెను. ఆయన నెమ్మదిగా కాంగ్రెసు సంస్థను సంఘటిత మొనర్చెను; ఇప్పుడు దాని నాయనయే నడుపుచున్నాడు.

ప్రతివ్యక్తికి, సంఘమునకు, పార్టీ లాభనష్టముల దృష్ట్యానే యాలోచన కలిగించును. ఆయన చుట్టునున్నవారును వినయ విధేయతలతో వర్తించునటుచేయఁగల మహాయోధుఁడు.

ఈ విరుద్ధశక్తులను సమన్వయించి నడిపించుకొని వచ్చుచున్నది భారత భాగ్యవిధాత గాంధిజీ. ఆయన యొక మహానాయకుఁడు. పటేల్ నెహ్రూలవంటి యనుచరులను గూడఁబట్టుకొని సాగగలఁడు. వీరిద్దరు నాయనను బూజించి, గౌరవించెదువారనుట నిస్సందేహము. ఆధ్యాత్మికతపట్ల నెహ్రూకుఁ గల శ్రద్ధవలననే గాంధీజీ కాయనపై వాత్సల్యము ప్రబలెను. ఆయన నైతికభావనప్రకారము వ్యక్తిలో వ్యక్తిత్వము ముఖ్యమైనది. అందువలననే నెహ్రూ యాయనకుఁ బ్రియతముఁడయ్యెను. గాంధీజీకిఁ బటేల్‌తోఁగల సంబంధములు కూడ నిట్లు దృఢతరమైనవే. సర్దా రాయనకుఁ దొలిగా లభించిన యాంతరంగికానుచరులలో నొకఁడు. ఆయన శక్తిసామర్థ్యములను గాంధిజీ గుర్తించి యాయనపట్ల నవిరళవాత్సల్యమును గలిగియుండెను. పటేల్‌పట్ల గాంధీజీ కత్యంతవిశ్వాస ముండుట వలననే యాయన చాల కాలమునుండి గాంధీజీకి "కుడిచేయి"గాఁ బరిగణింపఁబడుచుండెను. సర్దార్ కూడఁ బూర్తిగా గాంధీజీకి దోసిలొగ్గెను.

కాని వీరిద్దరు గాంధీజీతో ననేకపర్యాయము లేకీభవించలేదు. అంతర్జాతీయత, సోషలిజము మొదలగువానిపైఁ బండిట్ నెహ్రూ బాహాటముగానే గాంధీజీ నెదిర్చెను. పటేల్ తన చతురత, వాస్తవికదృక్పథములతో ననేకపర్యాయము లాయన యాదర్శాత్మకవిధానములను బ్రతిఘటించెను. కాని

గాంధీజీ నిర్ణయించిన తర్వాత దానికి దోసిలొగ్గుకొనును. ప్రసిద్ధపురుషుఁడు ప్రస్తుత మింత యున్నతస్థితిలో నుండుటకు గాంధీజీయే కారణము. ఎంతో యోచన చేసియే గాంధీజీ పటేల్‌ను గుజరాత్‌లోఁ దన ప్రధానానుచరుఁడుగా నిర్ణయించుకొనెను. అట్లు నిర్ణయించిన తర్వాత నాయనపట్లఁ జాలవిశ్వాస ముంచెను. సర్దార్ రాజకీయ ప్రతిష్ఠకు, నధికారమునకు నిదే తొలిమెట్టు.

భారతదేశ నాయకత్వము నెహ్రూకుఁగూడ గాంధీజీ వల్లనే లభించినది. లాహోర్ కాంగ్రెసు కధ్యక్షుఁడుగా-బహుశః చరిత్రలో నింత చిన్నవాఁ డెవ్వఁడు నధ్యక్షుఁడై యుండఁడు-నెహ్రూను నిలబెట్టినది గాంధీజీయే. గాంధీజీ నైతికశక్తియేఁ దన వెనుక లేకపోయినచో నెహ్రూ కాంగ్రెస్ యంత్రములో తన ప్రతిష్ఠ నిలఁబెట్టుకొ లేకపోయెడివాఁడే. పండిట్ నెహ్రూ యెప్పుడు పార్టీతంత్రములకు, నోట్లు సర్దించుట కిష్టపడఁడు. ఈయనకు గాంధీజీ యీపని చేసెడివాఁడు. చాల విధములుగా గాంధీజీ వల్లనే నెహ్రూ చెడిపోయినాఁడు

## భిన్న విధానములు

ఈ నాయకు లిద్దరి దృక్పథములలోఁగూడఁ జాలవిభేదము లున్నవి. నెహ్రూ యొకవిధమైన ఫేబియన్ సోషలిస్టు. అంతర్జాతీయవాది. చాల సమస్యలపట్ల నతనివైఖరి యతివాదధోరణిలో నుండును. పాశ్చాత్యసంస్కృతి, యలవాట్లన్న నతనికిఁ జాలమోజుకూడ. సంస్కృతి యలవాట్ల విషయములోఁ బటేల్ కేవలము భారతీయుఁడు. ఆయన యే యిజము'లోను నమ్మకముంచనంతటి చతురుఁడని చెప్పవచ్చును

గాని, సామాజికాభివృద్ధికి "ధనికవాద మవసర"మని యతఁడు భావించుచుండుట నిజము. నూతనసామాజికవ్యవస్థలోఁ గార్మికవర్గప్రాముఖ్యమును గుర్తించుటకే యాయన చాలకాలము నిరాకరించెను. అదే యాయనలోని గొప్పలోపము. నెహ్రూ యొక్క యాదర్శవాది. పటేలనుష్ఠానవేత్త.

దైనందిన వాస్తవిక రాజకీయములలో నెహ్రూపటేలు లిద్దరు సమానస్థానములలోనే యున్నారు. కాంగ్రెస్ తలపెట్టిన ప్రతి నూతనవిధానములోను నెహ్రూ గాంధీజీతో నేకీభవించెడువాఁడు. క్రమేణ ప్రజానీకమునకు నెదుట నాయన గాంధీజీ ముఖ్యప్రతినిధి యైనాఁడు. పటేల్ సంచాలకుఁ డైనాఁడు. నెహ్రూ ప్రజానీకమునకే చిహ్నమైనాఁడు. ఈ పదవి వెనుక నధికారమంతయుఁ బటేల్ చేతిలోనున్నది. వీరిద్దరు గాంధీజీతో నేకీభవించనిది క్రిప్సురాయబారపు సమయములో దేశవిభజన ప్రసక్తి వచ్చినప్పటి యొక్కపర్యాయముమాత్రమే. కాంగ్రెసు భవిష్యత్తును గూర్చి చర్చలు జరుగుచున్నప్పుడుకూడ వీరిద్దరు గాంధీజీతో నేకీభవించలేదు. కాంగ్రెసు భవిష్యత్తు విషయమై గాంధీజీకిఁ గొన్ని స్పష్టమగు నుద్దేశము లుండెను. కాని వీరిద్దరిని మహాత్ముఁడు చక్కఁగా సమన్వయపఱచి, కలసికట్టుగఁ బని చేయించఁగలిగెను. కార్మికసమస్యలు, పరిశ్రమలను జాతీయమొనర్చుట మొదలగు ముఖ్యసమస్యలపై గాంధీజీ యభిప్రాయములను గాంగ్రెసు సంప్రదాయమును రూపుదిద్దుటలో నెహ్రూకుఁ జాలప్రాబల్య ముండెననుటకూడ వాస్తవమే.

## ఐక్య మవసరము

ఇంతటి విభిన్నదృక్పథములుగల వ్యక్తు లనేకసమస్యలపై భిన్నాభిప్రాయములు కలిగియుండినప్పుడు యాశ్చర్యముగా నుండఁగలదు. వాస్తవమునకు వారిద్దరు నొకరిసూచనల నొకరనేకపర్యాయములు తీవ్రముగాఁ బ్రతిఘటించుకొనిరి. ఇది స్వాభావికమే. కాని దేశభవిష్యత్తు తామిద్దరుఁ గలసి పని చేయుటపైనే యాధారపడియున్నదని వారు గ్రహింపవలెను. గాంధీజీ హత్యానంతర మీ విషయము మఱింత ప్రాముఖ్యము వహించినది. చాలమంది యాశించినదానికి విరుద్ధముగా వారిద్దరుఁ గలసి పనిచేయఁగలిగిరి. అంతేగాక యీ సమయమున విడిపోవలెనని వారు కోరుకొన్నను విడిపోఁగలరా యన్నది సందేహాస్పదమే. వారిద్దరు విడిపోవుట ప్రస్తుతానిశ్చిత వాతావరణములో నొక పెద్ద సంక్షోభమునకు దారిదీసి, యెట్టి విషమపరిణామములనైనఁ గలిగించవచ్చుననుట నిస్సందేహము. కొంతమంది యవకాశవాదు లొకరియెదుట రెండవ వారిని దూషించి, తాము లాభము పొందవలెనని, యోచించుచు, వీరిద్దరిమధ్య విభేదములను వృద్ధిచేయుచున్నమాట కూడ వాస్తవమే.

రాజకీయచరిత్రలో నింతటియాశ్చర్యకరములు, విభిన్నాత్మకములైన 'కూటములు' లేకపోలేదు. రాజకీయవేత్తలకు భేదాభిప్రాయము లుండెడివి. ఇకముందు నుండఁగలవు. అందువలన వారొకే యాదర్శమునకొఱకుఁ గలసికట్టుగాఁ బనిచేయ లేకపోలేదు. పటేల్-నెహ్రూ లిప్పటివఱకుఁ బోరాడుకొనుచుండవచ్చును. కాని తాము కలసి పనిచేయక తప్పదని

గ్రహించి యిప్పుడు కలసి పనిచేయవచ్చును. వారి విభేదముల తీవ్రత వారి కలయిక నష్టపెట్టజాలదు.

వాస్తవమునకు, వారివిభేదములను గురించి మాట్లాడుచు వారిద్దరిమధ్యఁగలసామ్యమును, వారిద్దఱను దగ్గరకులాగుచున్న పరిస్థితులను ప్రజలు గ్రహింపకున్నారు. దేశములోని యత్యంతసంక్లిష్టస్థితియే కాక గాంధీజీపట్ల శ్రద్ధాభక్తులుకూడ వారి కలయిక కొక ప్రబలకారణము. రాజకీయముగ, నాధ్యాత్మికముగ వా రాయన కుటుంబమునకుఁ జెందినవారు. నెహ్రూ సోషలిస్టు దృక్పథము గాంధీజీ పలుకుబడివలనఁ జాలవఱకు మారినది. ఇద్దరు దశాబ్దములనుండి కలసి పనిచేయుట కలవాటుపడియుండిరి. ఒకరితప్పు లొకరికిఁ బూర్తిగాఁ దెలియును. బహుశః యనేక పర్యాయము లొకరి నొకరు తిట్టుకొనియుండవచ్చును. కాని దానిని విస్మరించి యైక్యముతో వారు వ్యవహరించఁగలరు.

## మహాత్మునివంటి సంస్థలు

తమ పలుకుబడి ప్రాబల్యమువలన నెహ్రూ పటేల్లిద్దరు గాంధీజీవంటి సంస్థలే యైనారు. వారు కేవల మగ్రనాయకులు మాత్రమే కాదు. ప్రస్తుత కల్లోల వాతావరణములోఁ బ్రజ లొక్కొక్కప్పుడు ప్రభుత్వ విధానములను నొక్కొక్కప్పుడు కాంగ్రెసు హైకమాండు చర్యలను నిరసించినను, చివరకు వీరిద్దరినిజూచియే, ప్రతి విషయము నంగీకరించుచున్నారు. నెహ్రూ పటేలులతర్వాత నేవ్యక్తిగాని, చివరకుఁ గాంగ్రెసుగాని యిటువంటి సమానదృష్టితోఁ బరకీ

లెంచఁబడెను. వారు సఫలులైరా ఫలితములనైనఁ జూపింపవలసి యుండును, లేదా నైరాశ్యులఁ గావలసి యుండును. నెహ్రూ-పటేలుల తప్పులను ప్రజలు—బహుశః యలవాటు ప్రకారమే—మన్నించి—సహించెదరు. అంతేకాని వారి తరువాతి వచ్చెడు వారి తప్పులను సహించరు. ఈ ముఖ్యవిషయములఁ గాంగ్రెసు పార్టీ ముఖ్యముగా భవిష్యత్తును గురించి యాలోచించుచున్నప్పుడు జ్ఞాపక ముంచుకొనవలెను.

భవిష్యత్తు విషయములోనే యీ యుద్ధము నాయకు లొక ముఖ్యవిషయములో నసమర్థులైపోయిరని చెప్పక తప్పదు. తమ తర్వాత తమ స్థానముల నాక్రమించి కార్యక్రమమును జయప్రదముగా సాగించఁగల సమర్థులగు "ద్వితీయశ్రేణి" నాయకులను వారు తయారు చేయలేకపోయిరి. తమ తర్వాతఁ దమ స్థానముల నాక్రమింపఁగల సమర్థులగు ననుచరులకుఁ దమ పద్ధతులలో శిక్షణనిచ్చుటకై వీరు నిర్లక్ష్యము చేయుచున్నారు.

"నా తదనంతరము బూడిదే" యన్న యుద్దేశమైనట్లు కనిపించుచున్నది. దేశము క్లిష్టపరిస్థితిలో నుండుటవలనను దేశములో వీ రిద్దరికి నొక ప్రత్యేకస్థాన ముండుటవలనను, నీ లోపము మత్యవసరకాలములో విషమపరిణామములకు దారి దీయఁగలదు. వాస్తవమునకు దేశమునకుఁ బ్రస్తుతప్రభుత్వమునకు విరోధులైనవారికీ లోపము తమకు గొప్ప సహాయకారి కాఁగలదని యాశించుచు నందు కెదురుచూచుచున్నారు. దీని నాధారముగాఁ జేసికొని ప్రణాళికలు కూడ నేర్పాటుచేసికొనుచున్నారు.

నెహ్రూ వైఖరి సులభముగానే బోధపడఁగలదు. తనకుఁ

ప్రత్యేకముగా ననుచరవర్గము నేర్పాటు చేసికొనుట కాయన నిరాకరించెను. ఇది శోచనీయము. రాజకీయముగాఁ దప్పిదైనను నున్న పరిస్థితి యిది. దూరదృష్టి, చాకచక్యముగల సర్దార్ పటేల్ వంటి యనుష్ఠాన రాజకీయవేత్త, తన తరువాతఁ దన స్థానమునాక్రమించగల యనుచరవర్గము నెందుకుఁ దయారు చేయుటలేదో బోధపడుటలేదు. ఇప్పుడు ప్రసిద్ధిలోనున్న కాంగ్రెసు నాయకులందరు ముసలివారు. త్వరలోనే వీరు గట్టిగాఁ బనిచేయ నసమర్థులౌదురు.

అందువలన భవిష్యత్తు చాల చంచలముగా ననిశ్చితముగా నున్నది. సమయమునకుఁ దగినట్లు వ్యక్తులుకూడ నుద్భవించఁగలరని యాశించవలెను. కాని యీ విషయమే భవిష్యద్రాజకీయవిషయములలో ముఖ్యమగు పాత్ర నిర్వహింపనున్నది. ఈ విషయములోనే గాంధీజీ ప్రజానీకప్రువాస్తవాద్వితీయనాయకుఁడుగాఁ గన్పించుచున్నాడు. తన యుత్తేజనకర శిక్షణలద్వారా యాయన మొరికలవంటి యనుచరులను దయారుచేయఁగలిగినాఁడు. వారే యీనాఁడు దేశమునకు నాయకత్వము వహించియున్నారు. ప్రస్తుత నాయకులందరు నాయనవద్ద నేర్చుకొన్నవారేగాని, యీ విషయములో నాయన విధానమును వీరు సాగించలేకపోవుచున్నారు.

నాయన నవ్వుచున్నప్పుడు నిష్పూనట్లె నుండును. యుద్ధసమయములలో నెట్టి చింతలేనట్లె నుండును. అపాయములయెడల నాహ్వా యము. ఆయన యనుక్షణము నపాయముల నాహ్వానముగా నాలింగన మొనర్చును. విచిత్రతరకార్యములను విలోకించుటకొఱకనే యాయనయుల్లము వికసించును. వేయేల? ఆయన నిప్పుతో చెలగాట లాడఁగోరును. బార్డోలీ సంగ్రామ ప్రారంభకాలమున నాయన కిసాను సభలో నిట్లు విస్పష్టపఱచి నాఁడు. "నాకో నెవరును గ్రహించజాలరు. ఆపదగాని భయము గాని లేని కార్యములలో నేను ప్రవేశించనే ప్రవేశించను. ఆపదల నాహ్వానించువారికి నేను సహాయపడుట కనుక్షణము సిద్ధముగా నుండును.

## "కడ్డీ చల్లపడుచున్నది."

ఆయనకీ స్వభావ మసహాయోద్యమకాలమునందే యాకస్మికముగా నేర్పడినదికాదు జన్మాదారభ్య యాయన యట్టివాఁడే. కష్టము లాయనను వంచజాలవు. భయ మాయనను భయపెట్టఁజాలదు. నేఁడేకాదు, బాల్యమాది యాయన నిర్భయుఁడు. ఆయన నిర్భయత్వమునకు బాల్యములోని దిగువ ఘటన తార్కాణము కాఁగలదు. ఆయనకుఁ గక్షమునఁ గుఱుపు లేచినది. మన పల్లెటూరి వైద్యులకు సర్వరోగనివారిణి రక్షలేగా! ఆ యూరి వైద్యుఁడు కడ్డీ బాగుగాఁ గాల్చి యా కుఱుపుమీదఁ బెట్టిన వెంటనే యెగిరిపోవునని చెప్పినాఁడు. బాలుఁడైన వల్లభాయి యా వైద్యుని మాటలు శిరసావహించి యావిధముగాఁ జేయుటకు సంకల్పించినాఁడు. కణకణలాడు

నిప్పులోఁ గఱ్ఱ పెట్టి బాగుగాఁ గాలనిచ్చి దగ్గరనున్న నొకవ్యక్తి కిచ్చి పుండుపైని బ్రాయుమని చెప్పెను. ఆ కఱ్ఱ చేతికందుకొన్న మనిసి యూ పేశికుడ్డునాతని గాల్చుటకు సంశయించుచుండెను. అంతట వల్లభాయి కనిసితుడ్డె యిట్లనెను. "ఏమిటి! ఇట్లాలో చించుచున్నావు. కఱ్ఱ చల్లారిపోవుచున్నది. నీవల్లఁగాకపోయిన నది యిటు లిమ్ము. నేనే కాల్చుకొందు"నన్నాఁడు. ఆమాట విని యాయన యాశ్చర్యపడినాఁడు.

## కఱ్ఱ యెప్పుడును వేడిగానే యుండును.

ఈ వీరపురుషుని హృదయములో నా కఱ్ఱ యెప్పుడును జల్లబడనేలేదు ఆ కఱ్ఱ చల్లపడుట చూడఁగానే యాయన దడదడఁ గొట్టుకొనును. ఎంతవఱకు నది వేడిగా నుండునో, యెంతవఱకు వాతావరణము తుపానులోఁ గూడుకొని యాపద దల కాటపట్టుగా నుండునో, యెంతవఱకు నగ్ని నలువైపుల ముట్టుకొని యాకాశమును కంటుకొనునో, యంతవఱకు నాయన నకు స్వర్గము. ఆ తుపా నాగి, యగ్ని చల్లారిన, నాయన యానంద మంతరించును. అగ్నిపర్వతమునుండి యగ్నికణములు బయలు దేరునట్లుగనే, విపదినస్థలో నాయన నోటినుండి వ్యాగ్రూపమైన యగ్నికణములు వెలువడును.

## గాంధీజీ లోకమాన్యుఁ గుణములు

వల్లభాయి గాంధీజీని గురువుగా గ్రహించినమాట సత్యమే. ఆయన వివేక మట్లు వరింపఁజేసినదికాని, యాయన తత్త్వము, నాయన ప్రేరణ, ప్రకృతి, లోకమాన్యునితో నధిక

ముగాఁ గలియును. లోకమాన్యుని సిద్ధాంతము 'శఠంప్రతి శాఠ్యం' — ఇదికి యెట్టిప్రతి నవలంబించిన నట్టిప్రతియే యవలంబించవలెనని యాయన సిద్ధాంతము. వల్లభాయి సిద్ధాంతముకూడ నట్టిదే. గాంధీజీ ప్రభావమువల్ల నది చాల సున్నితమైనది. కాని సిద్ధాంత మదియే. తిలక్ సిద్ధాంతముపైని గాంధీజీ ప్రభావము ప్రసరించుటవల్లఁ జేదుమందునకుఁ బంచదార పూఁదినట్లయినది. గాంధీజీ సిద్ధాంతము 'శఠం ప్రతి సత్యం.' రాలఁగొట్టినవారి వెన్నఁగొట్టవలయును. ఈ సిద్ధాంతము నాయన స్వీకరించినాఁడు. ఇది శ్రేష్ఠమైనదనికూడఁ దలఁచును. కాని యాయన సహజస్వభావమునకు గాంధీజీ సిద్ధాంత మనుకూలపడలేదు. ఆయన జీవనములోఁ గలియలేదు. తీర్థమునకుఁ దీర్థము, ప్రసాదమునకుఁ బ్రసాదముగా నవి విడివడిపోయినవి. ఆయన దానిని స్వీకరించెనుగాని, గాంధీజీవలె నీసాధనలో నాయన యాత్మ పరిపూర్ణమై వికసించలేదు. ఆయనపరిస్థితి, బుద్ధి, వివేకములలో నాయన గాంధీజీ వైపునకు మ్రొగ్గును. ఆయన ప్రకృతియో—ఆయన స్వభావము, ప్రవృత్తి, లోకమాన్యునివైపుకుఁ బోవును. ఈసంగతి సందర్భములన్నియు సమీక్షించినయెడల నాయనలో లోకమాన్యుని గుణములుగాని గాంధీజీ గుణములుగాని లేవు. వీరి యుభయగుణముల సమ్మిశ్రణమే వల్లభాయి. ఆయనలో వారిరువురి గుణములలోఁ గొన్ని యున్నవి. కొన్ని లేవు.

## లోకమాన్యత్వము

ఒకలక్షణము గాంధీజీ లోకమాన్యులతోఁ బోల్చిచూతము. లోకమాన్యుని యసాధారణవిద్వత్తు వల్ల

భాయిలో లేదు. ఆయన గంభీర శాస్త్రజ్ఞానము శూన్యము; లోకమాన్యుని రాజనీతికౌశలము లేదు. కాని యాయనలోని యత్యధిక పరిశ్రమ, పట్టుదల, వల్లభాయిలో గలవు. లోకమాన్యునివలె వల్లభాయికూడ ప్రజాసేవలో నాత్మవిస్మృతితో గృషిచేయును. లోకమాన్యునివలె నాయనకూడ దన్నుగురించి యేమియు వ్రాయడు, చెప్పడు. ఇంతేగాదు, లోకమాన్యునివలెనె బైకి గఠినుడుగా, నిష్ఠురుడుగా, నభిమానిగాc గన్పించునుగాని, సహజముగా, సరళుడు, కోమలుడు. స్వాతిశయము లేనివాడు.

## రాజకీయవేత్తగాను - యోధుడును

ఇన్ని సమానగుణము లున్నప్పటికిని వీరిలో విభేద మేమి? అసలు వల్లభాయి లోకమాన్యునితో సరిసమానుడు కాడు. వారుభయులలో జన్మతః విశేషవ్యత్యాసము కలదు. లోకమాన్యుడు రాజకీయవేత్త. వల్లభాయి రాజకీయవేత్త కాడు. యోధుడు; సైనికుడు. సేనాధిపతి, రాజకీయవేత్తలోను యోధునిలోను, దత్త్వతః యధికాంతరము కలదు. రాజకీయవేత్త జిహ్వ చాల యదుపాజ్ఞలలో నుండును. అతని శబ్దములు మృదువైన, సహజముగా రెండర్థములు కలిగియుండును. సహజముగా నతడు మనోగతాభిప్రాయమును మాటల ద్వారా వెల్లడించడు. అతి యవసరము నుపయోగించుకొనును. యోధుడట్లుగాక తద్భిన్నముగా సంచరించును. ఆతడు భావనను దత్త్వమును గ్రహించి సంచరించును. నైతిక విజయము లక్ష్యమైనను భౌతికావకాశములు తీసికొనుట యతని కంత

యిష్టపడుండడు. అతడాపదల నాలింగన మొనర్చును. వీరత్వ మాయనసహచారిణి. సాహస మాయన యనుచరుఁడు. ఆకాశము మేఘావృతమైనప్పుడు రాజకీయవేత్త ముఖములో విచార మేర్పడును. ఈ పరిస్థితియే యోధునికి హృదయానంద కరమై, ద్విగుణీకృతోత్సాహుఁడగును. శత్రువుయొక్క సవాలు విని రాజకీయవేత్త యిప్పుడు పోరాటముచేయవలెనా, యక్కర లేదా యని యాలోచించును. యోధుఁడో వెంటనే రణరంగమున దుముకును. ఈ దృష్టిలో లోకమాన్యుఁడు వల్లభాయి సమాన ప్రవృత్తి కలవారైనప్పటికిని వారిలోఁ దేడా కలదు.

## 'గాంధీజీ దృక్పథములో —'

మహాత్మునితో వల్లభాయిని బోల్చవలసి వచ్చిన, వారిలోఁ జాలవ్యత్యాసము కలదని స్పష్టపడఁగలదు. వ్యత్యాసమేకాదు, అసలు ప్రవృత్తిలోనే భేదముగలదు. ప్రవృత్తితోపాటు తాత్త్విక భేదమునుగలదు. గాంధీజీ సాధకుఁడు. సత్యము, ఆత్మసాక్షాత్కారము నాయనలక్ష్యములు. ఇందుచే సహజముగా నాయన జీవన మనావృతము, బహిరంగము. ఈ సత్యసాధన సందర్భములో నాయనకు సహకారులైన యల్పాత్యల్ప విషయముల నరమరలేక యాయన వెల్లడించును. సాధారణమానవుఁ డేవిషయములను జెప్పుటకుఁ గంపించునో, యట్టి విషయములనే యాయన యెట్టి సంకోచములేకుండ స్వీయసత్య సాధనకు సహాయకారులైనచోఁ జెప్పును. ఇతరులచే గౌరవపూర్వకముగా నీయఁబడిన స్వల్పవస్తువును గస్తురిబా తా నుంచుకోఁ దలచినప్పు డాయెడలఁ దాను ప్రవర్తించినవిధము

నిరభిమానముగా నాయన వ్రాసెను. అది యితరుల కసంభవము. మోహరహితుఁడైన యాధ్యాత్మికసాధకునకే యది సంభవము. అది యాయనపథము. వల్లభాయి యొక గొప్ప స్వార్థత్యాగియైన వీరపురుషునివలె స్వవిషయములో మౌనము దాల్చును. ఈ మౌనముకూడ వినువారలకుఁ గూడినదే. గాంధీజీ విరోధితోఁ బోరాడును. కాని విరోధియని భావించి కాదు. అతని నాశనము చేయుటకుఁగాదు; ఆతనిలో మార్పుఁ దెచ్చుటకు; నతనిని చెడుమార్గమునుండి తప్పించుటకును; యుద్ధసమయములోఁగూడ విరోధి కల్యాణము నాయన ధ్యానించును. ఈ సాధకుని యంతఃకరణములో నుండి నిబిడీకృతమైయున్న యుదారతచే నాయనకు సహజముగా శత్రువు లేఁడు. వల్లభాయి యుదారత వీరోచితమైనది. అతఁడు చాటుమాటుననుండి శత్రుసంహారము చేయ నుంకించఁడు. శత్రుసమ్ముఖముననే నిలఁబడి నిప్పులు గ్రక్కు కన్నులఁ జూచుచు నతనిని నాశనము చేయఁగోరును. శత్రుపరాజయముచే నుప్పొంగును. గాంధీజీ సత్యాగ్రహి. విరోధికిఁ దన కార్యక్రమమును బ్రప్రథమముననే సూచించును.

వల్లభాయి తా నెవరికి శత్రువో, మిత్రుఁడో సూచన చేయఁడు. ఆయన కార్యక్రమము మనము కనుగొనఁజాలము. కార్యానంతరమే కనుగొనఁగలము.

## శేషము

ఇంతేగాదు. మగన్‌లాల్‌జీ చక్కఁగా వారిద్దరనుగుఱించి యిట్లు వివరించినాడు. "మహాత్మాజీ యతి సామాన్యమానవునియొక్క ప్రశ్నకుఁగూడ జవాబుచెప్పును. అతని కుతూ

హాలము నీడేర్చును. వల్లభాయిని ప్రశ్నించుటకే సహజముగా ధైర్యముండదు ఆయనను ప్రశ్నించువారు వ్రేళ్ళమీఁదఁగూడ లెక్కపెట్టుట కుండరు. ఆయన స్వభావ మేమియనఁ దన విరోధికే యాఁయన జవాబు చెప్పును. మహాత్ముఁడు తన యాత్మకథ రచించగలఁడు. వల్లభాయి యాత్మచర్చ యెన్నడును జేయఁడు. మహాత్మాజీయొక్క సంయమనము, నాయన తపస్సు, మహత్తరమైన కృషిఫలితము. వీరవల్లభాయియొక్క సన్న్యాస మొకనాటి ప్రాతఃకాలమునఁ జేయబడినదైనప్పటికి నిలుకడగల దైనప్పటికి యోధుః ప్రతిజ్ఞగా నుండును. మహాత్మాజీ సాధకుఁడు, సంస్కర్త, బోధకుఁడు—వల్లభాయి సాధకుఁడు కాదు. సంస్కర్త కాదు. బోధకుఁడుగాదు. అతఁడు యోధుఁడు, సేనాని, సేనాధిపతి. మహాత్మునియొక్క మహత్తరమైన క్షమాగుణములో నాత్మనిరీక్షణ, యాత్మచింతన కలదు. వల్లభాయియొక్క క్షమ వీరోచిత క్షమ. దానిలోఁ దన ప్రత్యర్థియొక్క నూరుతప్పులను మన్నించగలఁడు.

'కర్మవీర్'—

## సర్దార్

పలువిధములఁ బరామర్శించినప్పటికి వల్లభాయిని గురించి యొక్కమాటలోఁ జెప్పవలయునన నతఁ డాత్మరక్షణ పరుఁడు. తన దేశమునకై బలియగు పురుషుని గుణగణములాయనలో గుమిగూడినవి. ఆయన యోధుఁడు. బుద్ధి, వివేకము, పరిస్థితి, పరానావలంబనము, సంఘటనాశక్తి, యీ యోధుని యోధునికంటె గొప్పవానినిగాఁ జేసినవి. ఆయన

లోని యీ సహజగుణములే యాయనను సైన్యాధిపతిగాఁ జేసి "సర్దార్" ఆసనముపై నధిష్ఠింపఁజేసినవి. రాజకీయవేత్తకు సహజలక్షణములగు—దీర్ఘదృష్టి—పటిమ రాజనీతి—యాయనలో లేదు. కాని గంభీరత, ప్రోత్సాహకరమైన భావావేశము: ఈ రెండు నావశ్యకమైనంత మాత్రమేయుండి యాయనను సైన్యాధిపతిఁ జేసినవి. సర్దారు కావశ్యకమైన యీ గుణము లాయనలో విరాజిల్లినవి. నీళ్లలోఁ జేప యెట్లు సహజముగాఁ గ్రీడించునో, యట్లే యుద్ధరంగములో నాయన విహరించును. రాజకీయవిషయములు, పరస్పర సమాలోచనలు, సంధులు, నాయన భావావేశమును శిథిలపఱచును. ఆయన ప్రతిభ యందుఁ గుంఠితమగును. ఈ సంగతినే స్వయముగా వచించినాఁడు. "పోరాటములోఁ గలుగు కష్టములు, చిక్కులు, వెంటనే నేను విడిపించుకొనఁగలను. ఇట్టి సంకటావస్థలనుండి విడివడుశక్తి నాకెట్లు కలుగునో, నేను వివరించజాలను. కాని రాజీసంభాషణలు నాకు మనస్కరించవు. ఇట్టి యకర్మణ్యాచర్చలలో నేననేకపర్యాయములు గందరగోళములో బడితిని."

## వాక్కులో నగ్ని

యుద్ధరంగమునందాయన వాణిలో నగ్ని యావిర్భవించును. యుద్ధకాలములో సరళమార్గమునఁగూడ నింతటి శక్తిమంతములైన శబ్దములను సృష్టించుటలో భారతనాయకులందరిలోను సర్దార్ సమర్థుఁడు. ఆయన వాణిలో నగ్ని కలదు. ఉదాహరణకు—"శత్రువునొక్క కత్తి సలసల కాగవలసినదే. సమ్మెటమాత్రము చల్లగా నున్నప్పుడు మాత్రమే యుపయో

గింపఁబడును." బార్డోలీ రైతులను గష్టముల నెదుర్కొనుటకు హెచ్చరించుచు, "వైశాఖజ్యేష్ఠమాసములలోఁ బ్రచండమగు నెండవేఁడిమి లేకపోయిన నాషాఢశ్రావణమాసములలో వర్షము లుండ వను సంగతి రైతులయిన మీకు మఱవరాదు. లేక "చంపుటకుఁ జచ్చుటకుఁ బ్రభుత్వమువారు సైనికుల నారు మాసములలోఁ దయారు చేయుదురు. మనము కేవలము మరణించుటే నేర్చుకొనవలయును. ఇట్టి సందర్భములో మూఁడు మాసము లెందుకు ?"

వల్లభాయి పండితుఁడన నెవరో యిట్లు వివరించిరి. "భాషను గృత్రిమపద్ధతిని నిగూఢముగాఁ జేయువాఁడే పండితుఁడు." విద్యార్థులయెదుటఁ బ్రసంగించుచునిట్లన్నాఁడు. సర్పము తన కుబుసమును విడిచివేయుటలో నేమైన బాధగలుఁగునా? ఏమైన శ్రమచేయునా? ఇదేవిధముగా మనముకూడ నొకానొకదినమునఁ బరప్రభుత్వ మను కుబుసమునువిసర్జించఁగలము. ఇందులో శ్రమగాని కష్టముగాని యేమున్నది?" ఈ విధముగానే "ప్రభుత్వము దుష్కార్యము చేసిన రైతు సూటిగాఁ జెప్పవలసిన జవాబిది. ..........."హో, హో, నీబోటిరాజు లెందఱో మట్టిలోఁ గలియుట కనులారఁ జూచితిని." బార్డోలీ సత్యాగ్రహ సమయములో బాలోడైలోఁ బ్రసంగించుచు— "ప్రభుత్వమువారు జైలు కతిథుల నాహ్వానించుచున్నారు. మీరు. వారికిఁ గావలసినంతమందిని బంపించఁగోరుచున్నాను. ఇదేవిధముగా నాయనను నిర్బంధించినపుడుకూడ భారతీయ వాతావరణ సూచకముగాఁ జెప్పెను. "ప్రభుత్వమువారు నా కాళ్ళను ద్రుంచివేసి ఱెక్కలులేని పక్షినపుడునని విశ్వ

సించుచున్నారు. వర్షము కురిసినవెంటనే గడ్డిమొలచునట్లనే కాలు నూతనపురుషు లుద్భవించఁగలరని వారిని నేను హెచ్చరించుచున్నాను."

ఇవన్నియు యుద్ధకాలమునఁ బలికిన పలుకులు. సహజముగా వల్లభాయికి మాట్లాడు సలవాటు తక్కువ. ఒక్కమాటలో వచింపనలెనన నాయనలో మాటలుతక్కువ. క్రియ యెక్కువ. ఆయన వాక్పటుడు కాడు వేదిక లెక్కి లెక్చర్లు కొట్టు మానిసికాదు. ఆయన పబ్లిసిటీ కోరఁడు. కార్యము నను సరించి యాయన ప్రకటనఁ గోరునుగాని తననుగురించి ప్రకటన మాత్రము చేయఁడు. ఆయన గర్జించు మేఘమువంటివాఁడు కాఁడు. కుంభవృష్టి కురిసించు కారుమేఘమువంటివాఁడు. అటులనే యాయన మౌన మాశ్చర్యజనకమైనది. ఆయన సహజవీరుఁడు. అందుచే నుత్తరకుమారప్రజ్ఞ లాయనకు సరిపడవు. .......... ..కఠోరముఖము, దృఢమైన దవడలు, శత్రువురఁ గాయ్యమునకు కాలుద్రవ్వు కన్నులు, విషముతో నిండిన వ్యాంగ్యము, ఇవి వల్లభాయి స్వరూపస్వభావములు. ఆయన ముఖవర్చస్సులో నాయన యాంతరంగికశక్తి కనుగొనవగునని యొక యాంగ్లేయ పత్రికావిలేఖకుఁడు పలికినమాట యక్షరాల నిజము. ఆయన వ్యంగ్య మాయనకు సమ్మతము వంటిది. సాధారణాచరులనేకాదు గాంధీజీపైనగూడ వ్యంగ్య బాణము వదలుటలో నాయన యిూషణ్మాత్రము సంకోచించఁడు. తుపానులో నాయన పర్వతమువలె నచలుఁడు. విరోధియెడలఁ గఠినుఁడు ఈ విషయములో గాంధీజీకి నాయనకు నెట్టిపోలికయు లేదు. విరోధి కాంగ్రెసువాఁడుకాని, తదితరుఁడుకాని,

యాయన యన్న మిక్కిలి భయపడును. ఎందుచేతనన నాయన యెవ్వరి నెంటఁబడునో వానిని నామరూపములు లేకుండఁజేసి విడిచిపెట్టగలఁడు. నిర్మాణములోను, గార్యనిర్వహణలోను నాయనలో నపూర్వశక్తి గలదు. గుజరాతులో నాయనను బ్రతిఘటించు పురుషుఁడు పుట్టలేదు.

కర్షకుల ఆశాజ్యోతి

నీని యన్నిటికిమించి వల్లభాయి కిసానుల హృదయమును గనుగొన్నాఁడు. భారతదేశమునకు సరియైన ప్రతినిధులుగా వారిని గ్రహించి వారిని దనవారిగా నెంచెను. ఆయన కిసానులను బాగుగా దెలిసికొన్నాఁడు. రైతు లాయనను బూర్తిగా గ్రహించినారు. కాకా కలేల్కరిట్లు వ్రాసెను "రైతాంగము వ్యాకులహృదయ మైనప్పుడు వల్లభాయి రక్తముపొంగును. ఈ బాధాహేతువువలననే యాయన గ్రామములను దన కార్యక్షేత్రముగా గావించి రైతుల నాత్మీయులుగా భావించుటయే కాక యాయనయే కృషీవలుఁడైనాఁడు. ఖైరా, బోర్సద్, బార్డోలీ-యివియన్నియు నిందు కుదాహరణములు. ఆయనవలె రైతాంగమునకుఁ బ్రత్యక్షముగా నింత సహాయము చేసిన నాయకులు భారతీయనాయకవర్గములో లేరు. ఆయన భారతీయకర్షకుల యాశాజ్యోతి-ఆయనను గురించి "జోనాబేలీ"రచించిన యీ పంక్తులు నిత్యసత్యములు.

Even to the dullest peasant standing by
Who fasten'd still on him a wandering eye,
He seemed the master-spirit of the land.

వల్లభాయి కాంగ్రెసుయొక్క సంఘటనాత్మక ప్రతిభాశక్తులకుఁ జిహ్నము.

# జీవిత చరిత్రలు

| | | | | |
|---|---|---|---|---|
| ఆచార్యరంగా | (గొర్రెపాటి వెంకటసుబ్బయ్య) | 5 | 0 | 0 |
| మన రైతుపెద్ద | ,, | 2 | 8 | 0 |
| సరోజినీ దేవి | ,, | 1 | 8 | 0 |
| సర్దార్ వల్లభాయిపటేల్ | ,, | 2 | 8 | 0 |
| గాంధీ తాత | ,, | 1 | 4 | 0 |
| ప్రజానాయకుడు ప్రకాశం | ,, | 0 | 12 | 0 |
| ఆచార్య కృపలానీ | (కామేశ్వరరావు) | 0 | 12 | 0 |
| వినాయక్ సావర్కార్ | (జగ్గన్నశాస్త్రి) | 0 | 12 | 0 |